# వీక్షణం

ఆర్థిక, సామాజిక పక్షపత్రిక

సంపుటి: 1 సంచిక: 5
జనవరి 16-31, 2004

సమతా పబ్లికేషన్స్ ప్రచురణ

పేజీలు : 24
వెల: రూ.6-00



లోపలి పేజీల్లో...



విడి ప్రతి : రూ॥ 6/-
వార్షిక చందా : రూ॥140/-లు

సంపాదకీయం:

## పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి చీకటి రోజులు

కమ్యూనిస్టులు హింసావాదులు, వాళ్లకు పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో విశ్వాసం లేదు - ఇది కమ్యూనిస్టుల మీద సామ్రాజ్యవాదుల దగ్గర నుంచి కుహనా ప్రజాస్వామ్యవాదుల వరకూ చేస్తున్న విమర్శ. పార్టీ ప్రయోజనాల కోసం పార్లమెంటునే ముందస్తుగా రద్దు చేయటం పార్లమెంటరీ ప్రజాస్వామ్యమని కాషాయ ప్రభుత్వం అంటుంటే, తన మీద దాడిని సాకుగా మార్చి శాసనసభనే రద్దు చేయటం పార్లమెంటరీ ప్రజస్వామ్యం అని రాష్ట్ర ప్రభుత్వం చెప్పకుంటుంది. అంతటితో ఆగలేదు.

ఎన్నికల చట్టం నియమ నిబంధనలు ఎన్నికల తేదీ ప్రకటించిన తర్వాతనే అమల్లోకి వస్తాయి. తదనంతరం ప్రభుత్వాలు ఓటర్లను ఏ విధంగానూ ప్రభావితం చేసే నిర్ణయాలు తీసుకోకూడదు. అందుకు భిన్నంగా అటు కమలనాథులు, ఇటు తెలుగుదేశాధీశులు ముందస్తు ఎన్నికల్లో లబ్ధికోసం కురిపిస్తున్న ఏకధాటి 'వరాల వర్షం'తో రాష్ట్రప్రజలు తడిసి ముద్దవుతున్నారు. సాంకేతికంగా చూస్తే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఇటీవల కురిపిస్తున్న వరాల జల్లులు ఆక్షేపణీయం కాకపోవచ్చు. కాని రాబోయే ఎన్నికల్లో ఓటర్లకు గాలం వేయడమే ఈ వరాల లక్ష్యమని ప్రత్యేకంగా చెప్పాల్సిన పని లేదు. ఇవి పరిపాలన కొనసాగించడానికి అత్యవసరంగా ప్రకటించాల్సిన అవసరాలేమీ కావు; ఎన్నికల అనంతరం తీసుకోదగిన చర్యలు. ముఖ్యంగా బడ్జెట్‌లో, అలాగే ఎగ్జిం పాలసీల్లో చేయాల్సిన ప్రకటనలను, తీసుకోవాల్సిన చర్యలను ఇంత ముందస్తుగా ప్రకటించడం పార్లమెంటరీ విధానాలను పాతరేయడమే అవుతుంది.

గత 53 సంవత్సరాల పార్లమెంటరీ చరిత్రలో ఇంత అనైతికంగా బరితెగించి, నిస్సిగ్గుగా ఏ ప్రభుత్వమూ ప్రవర్తించలేదు. కాంగ్రెస్ పార్టీ కూడా వరాలను ప్రకటించి వుంది కాని, ఇంత హోల్‌సేల్‌గా, ఇలా తలుపులు బార్లా తెరిచి, ఓట్ల దోపిడీకి పాల్పడిన దాఖలాలు లేవు. కమ్యూనిస్టులు మూడు రాష్ట్రాలలో అధికారంలోకి మళ్లీ మళ్లీ వచ్చారు. వారు ఎన్నికల ముందు అధికారాన్ని దుర్వినియోగం చేసి, ఓట్లు అర్థించారనే నీతిమాలిన పని చేశారనే ఆరోపణను ఎదుర్కొనలేదు.

రాజ్యాంగం ఆమోదించిన 10 సంవత్సరాల్లో నిరక్షరాస్యతను నిర్మూలించాలని ఆదేశించి అర్థశతాబ్దం దాటినా కూడా ఆ లక్ష్యాన్ని ఎందుకు సాధించలేకపోయారో ఇప్పుడర్థమవుతుంది. ప్రజలు అజ్ఞానాంధకారంలో, మూఢవిశ్వాసాల్లో మునిగి తేలుతుంటేనే, వారి ఓట్లు దోచుకోవడం సులభం. ఇది పార్లమెంటరీ ప్రజాస్వామ్యమేనా? అనివారు ప్రశ్నించరు. వాళ్ళు చదువుకొంటే ఇలాంటి ప్రశ్నలు వేసే ప్రమాదం వుంది. నోట్లతో వోట్లు కొనటానికి వీలుండదు. ప్రజాస్వామ్యం ముసుగులో జరుగుతున్న ఈ ధోరణి వల్ల ప్రజాస్వామ్యం పట్ల ప్రజల్లో చులకన భావం ఏర్పడడానికి కారణం అవుతుంది. అంతిమంగా ప్రజాస్వామ్యరహిత సమాజ నిర్మాణానికే దారితీస్తుంది. ●

## స్థూలరాష్ట్రాదాయం పెరుగుదల : రాష్ట్రం/దేశం

| | స్థూలరాష్ట్రాదాయం పెరుగుదల ఆంధ్ర | స్థూలజాతీయాదాయం పెరుగుదల దేశం | స్థూలరాష్ట్రాదాయం తలసరి | తలసరి జిడిపి పెరుగుదలశాతం |
|---|---|---|---|---|
| 1980-1 నుంచి 1990-1 | 5.50 | 5.37 | 3.3 | 3.24 |
| 1993-94 నుంచి 2000-01 | 5.31 | 6.13 | 4.04 | 4.38 |

## స్థూలరాష్ట్రాదాయ పెరుగుదల : ఆంధ్రప్రదేశ్, ఇతర రాష్ట్రాలు

| | 1980-91 | 1993-2001 |
|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 5.50 | 5.31 |
| గుజరాత్ | 4.96 | 5.98 |
| కర్నాటక | 5.16 | 7.92 |
| మహారాష్ట్ర | 5.85 | 5.75 |
| పశ్చిమబెంగాల్ | 5.24 | 6.04 |
| రాజస్థాన్ | 6.39 | 6.21 |
| తమిళనాడు | 5.24 | 6.04 |
| దేశం | 5.37 | 6.31 |

మూలం : పదవ ప్రణాళిక – ప్రణాళికా సంఘం ప్రచురణ

## మానవాభివృద్ధి; వివిధ రాష్ట్రాల రాంకులు

| | 1981 | 1991 | 2001 |
|---|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 9 | 9 | 10 |
| అస్సాం | 10 | 10 | 14 |
| బీహార్ | 15 | 15 | 15 |
| గుజరాత్ | 4 | 6 | 6 |
| హర్యానా | 5 | 5 | 5 |
| కర్నాటక | 6 | 7 | 7 |
| కేరళ | 1 | 1 | 1 |
| మధ్యప్రదేశ్ | 14 | 13 | 12 |
| మహారాష్ట్ర | 3 | 4 | 4 |
| ఒరిస్సా | 11 | 12 | 11 |
| పంజాబ్ | 2 | 2 | 2 |
| రాజస్థాన్ | 12 | 11 | 9 |
| తమిళనాడు | 7 | 3 | 3 |
| ఉత్తరప్రదేశ్ | 13 | 14 | 13 |
| పశ్చిమబెంగాల్ | 8 | 8 | 8 |

## స్థూలరాష్ట్రాదాయంలో రుణభార శాతం

| రాష్ట్రం | 1995-96 | రాష్ట్రం | 2000-01 |
|---|---|---|---|
| మహారాష్ట్ర | 11.58 (1) | మహారాష్ట్ర | 18.70 (1) |
| గుజరాత్ | 15.48 (2) | తమిళనాడు | 20.89 (2) |
| తమిళనాడు | 15.99 (3) | కర్నాటక | 21.14 (3) |
| కర్నాటక | 17.60 (4) | హర్యానా | 24.50 (4) |
| ఆంధ్రప్రదేశ్ | 18.99 (5) | ఆంధ్రప్రదేశ్ | 25.62 (5) |
| హర్యానా | 19.40 (6) | గుజరాత్ | 26.58 (6) |
| పశ్చిమబెంగాల్ | 20.85 (7) | పశ్చిమబెంగాల్ | 33.69 (7) |
| రాజస్థాన్ | 25.74 (8) | అస్సాం | 34.00 (8) |
| మధ్యప్రదేశ్ | 25.75 (9) | కేరళ | 34.64 (9) |
| కేరళ | 26.09 (10) | మధ్యప్రదేశ్ | 35.92 (10) |
| అస్సాం | 28.13 (11) | ఉత్తరప్రదేశ్ | 36.70 (11) |
| ఉత్తరప్రదేశ్ | 28.21 (12) | రాజస్థాన్ | 40.09 (12) |
| పంజాబ్ | 35.30 (13) | పంజాబ్ | 40.66 (13) |
| ఒరిస్సా | 35.32 (14) | ఒరిస్సా | 60.50 (14) |
| బీహార్ | 67.67 (15) | బీహార్ | 73.11 (15) |
| 15 రాష్ట్రాలు | 22.05 | 15 రాష్ట్రాలు | 30.69 |

మూలం: పదవ ప్రణాళిక – ప్రణాళికా సంఘం ప్రచురణ

# ప్రపంచ బ్యాంక్ వ్యతిరేకోద్యమాలకు స్ఫూర్తినివ్వనున్న డాక్టర్ల సమ్మె

మన రాష్ట్రాన్ని పరిపాలించేది చంద్రబాబు కాదు, ప్రపంచ బ్యాంకు అని జూనియర్ డాక్టర్ల సమ్మె రుజువు చేసింది. 40 రోజులు సమ్మె చేసినా, ప్రభుత్వం ఒక్క అంగుళం కూడా దిగిరాలేదంటే, దాని కారణం యూజర్ ఛార్జీలు వసూలు చేస్తానని, వైద్య విద్య ప్రైవేటీకరిస్తానని ప్రపంచ బ్యాంకు రుణం ఇవ్వడానికి పెట్టిన షరతులకు తలవంచి, సంతకం పెట్టడమే. ఇలాంటి పెద్దమనిషి ఆత్మగౌరవం గురించి మాట్లాడటం విచిత్రం. విడ్డూరం కూడా. ఇన్నివేల మంది జూనియర్ డాక్టర్లు ఎన్నికలు సమీపిస్తుండగా సమ్మెకు దిగారు, వారి కోర్కెలను అంగీకరించక పోతే, దాని ప్రభావం వోటింగు మీద వుంటుందని ముఖ్యమంత్రికి తెలియకపోదు. అయినా ప్రభుత్వం దిగిరాలేదంటే చంద్రబాబు ప్రపంచబ్యాంకు ధృతరాష్ట్ర కౌగిలిలో ఎలా చిక్కుకుపోయారో అర్థం అవుతుంది.

ఆర్.టి.సి. సమ్మెకు, డాక్టర్ల సమ్మెకు ఒక పోలిక వుంది. రెండు సమ్మెలూ కార్మికులు, డాక్టర్లు వారి జీతభత్యాల కోసం చేసినవి కావు. రెండు సమ్మెల్లో ప్రజలు తీవ్ర అసౌకర్యానికి గురయ్యారు. అయినా వారి నుంచి వ్యతిరేకత రాలేదు. రెండు సమ్మెల సందర్భంలో నూటికి నూరుశాతం ఉద్యోగులు సమ్మె చేయటం, వారు సమైక్యంగా చివరి వరకూ నిలబడడం కార్మికులు, ఉద్యోగులు గమనించాల్సిన విషయం.

పాలక పార్టీలు తప్ప, మిగతా అన్ని రాజకీయ పార్టీలు పూర్తిగా సమ్మెను బలపరచటం కూడా మరొక ముఖ్యమైన విషయం. ఎన్నికల బరిలోకి దిగనున్న రాజకీయ పార్టీలు దీనినుంచి గుణపాఠం నేర్చుకొంటారనే ఆశించాలి. సమ్మె ప్రారంభ దినాల్లో రాజకీయ పార్టీలు అవసరమైన మేరకు స్పందించలేదనే చెప్పాలి. తర్వాత తర్వాతనే పార్టీలు ముగ్గులోకి దిగాయి. "జూనియర్ డాక్టర్లు అంటే యువతీయువకులు ఏదో వేడి రక్తంలో సమ్మెకు దిగారు, వేడి చల్లారితే జారిపోతార"ని అనుకొన్నారేమో తెలియదు. పార్టీలు చురుగ్గా రంగంలోకి దిగుతున్న సమయంలో న్యాయపీఠం నిర్ణయం వచ్చింది. ఇటీవలి కాలంలో కార్మికోద్యమం మీద బాణాలు సంధిస్తున్నా న్యాయవ్యవస్థ కూడా డాక్టర్ల ఉద్యమం యొక్క రీజనబుల్‌నెస్‌ను గమనించక తప్పలేదు. సమ్మె ఉపసంహరించి యువ డాక్టర్లు పరిణతిని ప్రదర్శించారు. ఉపసంహరించినా, గ్రామాల్లోకి, ప్రజల్లోకి వెళ్లాలని నిర్ణయించటం పరిణతికి మరో ఉదాహరణ. వారితోపాటు యువజన విద్యార్థి సంఘాల నాయకులు కూడా ప్రచార పర్యటనలో పాల్గొని ప్రపంచ బ్యాంకును ఎండగట్టాలి.

* * *

కోట్ల టన్నుల ఆహారధాన్యాల నిల్వలు గోధాముల్లో మూలుగుతుండగానే, దేశంలో ఆకలిచావులు జరుగుతుంటే, ఆకలి కేకలు వినిపిస్తుంటే, వారికి సహాయం చేయకుండా, వాటి ఎగుమతిని అనుమతించింది వాజ్‌పేయ్ ప్రభుత్వం. చమురు ఉత్పత్తుల ఎగుమతులను అనుమతిస్తూ, దేశంలో చమురు అవసరాలకు దిగుమతి అనుమతిస్తుంది వాజ్‌పేయ్ ప్రభుత్వం. ఉల్లి బాగా పండించే గుజరాత్, మహారాష్ట్రల్లో వర్షాల వల్ల పంట దెబ్బతిన్న తరుణంలో, దేశావసరాలను తీర్చాల్సిన అవసరం వుండగా, ఉల్లిపాయల ఎగుమతుల మీద వున్న కొన్ని ప్రతిబంధకాలను తొలగించి మరీ ఎగుమతి అనుమతించింది. వాజ్‌పేయ్ ప్రభుత్వం వెంకయ్య నాయుడుగారు ఇదేనా భారతదేశం వెలిగి పోవడమంటే?

ప్రపంచబ్యాంకుతో ఫెవికాల్ పెట్టి అంటించేసుకొన్న చంద్రబాబుకు ఆ బ్యాంకు చెప్పిందే వేదం. ఆ బ్యాంకు సహాయం అందించిన దేశాల వైపు చూసి నేర్చుకోవయ్యా అంటే అటు ఇటూ చూడడానికి బ్యాంకు పర్మిషన్ ఇవ్వదుకదా. అలా చూసివుంటే ఆరోగ్యభద్రత గురించి బ్రెజిల్ అమలుపరుస్తున్న జాతీయవిధానం ఆయనకు కనపడి వుండేది. ఎప్పుడో 1988లోనే ఆరోగ్యం ప్రాథమిక హక్కుగా రాజ్యాంగంలోనే పొందుపరిచారు. దేశంలో ఎక్కడ ఆసుపత్రి వున్నా ఆరోగ్యసేవలు ఉచితంగా అందుకొనే హక్కు వుంది. దేశంలోని 5800 మునిసిపాలిటీల బడ్జెట్లలో ప్రాథమిక ఆరోగ్య సేవలకు కేటాయింపులు చేయబడ్డాయి. ఆయా మునిసిపాలిటీ జనాభా ఆధారంగా కేంద్రం నిధులు అందచేస్తుంది. ప్రతి మునిసిపాలిటీ 15శాతం బడ్జెట్‌ను ఆరోగ్యానికి కేటాయించాలి. బ్రెజిల్ అభివృద్ధి చెందుతున్న దేశం. ఇంత డబ్బు ఖర్చు చేయటానికి నిధులెక్కడ నుంచి వస్తాయి? రాజ్యాంగంలోనే ఆరోగ్యానికి నిర్దేశించిన స్థాయిలో బడ్జెట్‌లో నిధులు కేటాయించాలి. జాతీయప్రభుత్వం 7.9 నుంచి 9.4శాతం ఈ పద్దుకు కేటాయించాలి. రాష్ట్ర ప్రభుత్వాలు 12శాతం కేటాయించాలి. ఈ కేటాయింపులు ఖర్చులు సమంగా జరుగుతున్నాయా లేదా అని చూడడానికి అధికారులు, ప్రజా ప్రతినిధులు, హెల్త్ వర్కర్ల ప్రతినిధులతో ఒక వ్యవస్థ పనిచేస్తుంది. ఈ విధానం వల్ల ప్రజలకు ఆరోగ్య భద్రత కల్పించడమే కాక కొన్ని వేలమందికి ఉపాధి కల్పిస్తుంది. చంద్రబాబూ, వింటున్నారా?

**– విహారి**

# ఆంధ్రప్రదేశ్‌లో హక్కుల అణచివేతకు ప్రతిస్పందనే 'అలిపిరి'

- కె.జి.కన్నాభిరాన్ (పియుసిఎల్)
- కె. బాల్‌గోపాల్ (హెచ్‌ఆర్ఎఫ్)

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిపై గత అక్టోబర్ 1వతేదీన తిరుమల కొండల ముంగిట జరిగిన హత్యాయత్నం అనంతరం, నక్సలైట్ల పట్ల ఎలాంటి సానుభూతి లేనివారు కూడా- నక్సల్ సమస్యకు అర్థవంతమైన, సమర్థవంతమైన పరిష్కారం కనుగొనాలన్న అవసరాన్ని గుర్తించారు. కాని ఈ హత్యాయత్నానికి గురైన వ్యక్తి మాత్రం ఆ అవసరాన్ని గుర్తించకపోవడం విచారకరం. ఇందుకు సంబంధించిన అంశాలను అంచనావేస్తూ అంశాల్ని చర్చించడం ఈ వ్యాసం ఉద్దేశం.

## రాజకీయ సమస్య

నక్సలైట్ ఉద్యమం ప్రధానంగా ఒక రాజకీయ ఉద్యమం. పార్లమెంటరీ విధానంద్వారా విప్లవం సాధించలేమని, విశ్వసించిన కమ్యూనిస్టు ఉద్యమంలోని కొందరు నక్సలైట్ ఉద్యమాన్ని చేపట్టారు. ప్రభుత్వం తరపున ఎలాంటి విధానపరమైన చొరవలేనంత వరకూ ఈ విశ్వాసం మారేదికాదు.

ఈ విశ్వాసం కేవలం ఒక రాజకీయ సిద్ధాంతానికో విశ్వాసానికో మాత్రమే పరిమితమై పనిచేసేది కాదు. ఒక రాజకీయ ఉద్యమంగా అది తనకు మద్దతునిచ్చే ప్రజల్లోనే జీవిస్తుంది, పనిచేస్తుంది. నక్సలైట్ ఉద్యమానికి సానుభూతి తెలిపే ఆ ప్రజలు కూడా, రాజ్యాంగేతర ఉద్యమాలకు మద్దతు ఇచ్చే ఇతర వర్గాల ప్రజలవలెనే ఎన్నో ఇబ్బందులకు గురవుతున్నారు. అయినా వారు దానికి మద్దతునిచ్చి, కొనసాగిస్తుండేట్లయితే, అందుకు కారణం ప్రస్తుత సామాజిక నిర్మాణంలో వారు ఎదుర్కొంటున్న భౌతిక సామాజిక అశాభంగాలే. అలాగే, నక్సలైట్ రాజకీయులు కల్పిస్తున్న వాగ్దానాలు, కార్యక్రమాల ద్వారా ఉపశమనం వారు పొందుతుండటమే.

నక్సలైట్ ఉద్యమాన్ని పరిష్కరించగలిగే అర్థవంతమైన, సమర్థవంతమైన విధానమే ఈ సమస్యను కూడా ఎదుర్కొనగలుగుతుంది. ఆంధ్రప్రదేశ్‌లో రాజకీయ వ్యవస్థకి అలాంటి విధానాలు ఎన్నడూ లేవు. చంద్రబాబు వ్యవహార సరళి పరిస్థితుల్ని ఇంకా దిగజారుస్తున్నాయన్నది వాస్తవం. ప్రజలు ఇంతగా దగాపడటానికి కారణం- భౌతిక వనరులేవీ వారికి అందుబాటులో లేకపోవడం. అలాగే అవి వారికి అందుబాటులోకి వచ్చే అవకాశాలూ లోపించడం. అందుకు పలురకాల ఆర్థిక సామాజిక విధానాలు క్రమేపీ అయినా సృష్టించడం అవసరం. ఈ విషయానికి సంబంధించి గతంలో 5 శాతం వాస్తవ చర్యలు, 95 శాతం శుష్క వాగ్దానాల ప్రచారం జరిగేది. చంద్రబాబు ఆ 5 శాతం ప్రత్యక్ష చర్యలు కూడా పరిపాలనా నియంత్రణలో లేవని ప్రకటించారు. పరిపాలన చేయగలిగేది మార్కెట్ ఏర్పాట్లు కల్పించడం కోసమే మనుగడకు ఏర్పాట్లు చేయడమో, లేదా అందుకు అవసరమైన వనరులు అందుబాటులోకి తేవడమో కాదు.

ఇప్పటికే వనరులు అందుబాటులోగల వర్గాలకు అలాంటి విధానపర దృక్పథం మరింత అవకాశాలను కల్పిస్తోంది. అంతేతప్ప కొద్దిబాటు అందుబాటుగల వారికి, అసలే లేనివారిలో అయితే ఎంతమాత్రం ఉపయోగపడటంలేదు. అలా ఎలాంటి అవకాశాలూ లేనివారూ, కొద్దిపాటి అవకాశాలు మాత్రమే ఉన్నవారు నక్సలైట్ ఉద్యమానికి ఆధారమయ్యారు.

## ప్రైవేటుపరమైన సహజవనరులు

ఆంధ్రప్రదేశ్‌కి ముఖ్యమంత్రిగా అయినవెంటనే చంద్రబాబు నాయుడు విజన్ 2020పేరిట రానున్న రెండు దశాబ్దాలకుగాను ఒక ప్రణాళికాపత్రాన్ని ప్రకటించారు. దాని స్వరూపాన్ని ఇతర విధానపర నిర్ణయాలతో నింపారు. భూమి వినియోగం, నీటిపారుదల, వ్యవసాయం, విద్య, ఆరోగ్యం, కార్మిక సంక్షేమం మొదలైన రంగాలలో పరిపాలనాపరమైన అంశాలనే ప్రచారం చేశారు. ఆర్థిక దారిద్ర్యంతో, సామాజిక వివక్షతో బాధపడేవారికి వీటన్నింటిలో కనిపించే ఉపశమనం అతిస్వల్పమే! చంద్రబాబు సామాజిక ఆర్థికతత్వం, ప్రపంచబ్యాంకు మార్కెట్ ప్రధాన దృక్పథమేనని అందరికీ తెలిసిన విషయమే.

అందువల్ల ఈ దృక్పథానికి ఆయన ప్రపంచబ్యాంకు మద్దతును పుష్కలంగా సంపాదించుకుంటున్నారు. ఈ దృక్పథం వల్ల భూమి, అడవులు, నీరు, ప్రకృతివనరులు మొదలైన వనరులన్నీ పెట్టుబడిపెట్టి, అధిక ఫలితాలు సాధించగలిగేవారికే అందుబాటులోకి వచ్చాయి. అంతేతప్ప వాటిపై ఆధారపడి జీవించే వారికి మాత్రం కాదు. భారత్ లాంటి దేశంలో అధిక సంఖ్యాకులు ఆధారపడేది ప్రకృతిపైనే! తమ మనుగడకు వారు ఆధారపడవలసింది ప్రకృతి వనరుల పైననే! అందువల్ల ఈ విధానాలు జీవనోపాధులపై విధ్వంసకర ప్రభావాన్ని చూపాయి.

## భూమి - అడవులు

గతంలో, ప్రభుత్వ నియంత్రణలో సాగే భూపంపకంపైనే పేదలకు

జీవనోపాధి వనరులు అందుబాటులోకి వచ్చేవి. వాస్తవానికి దేశంలో మిగులు భూమిలో అతికొద్ది భాగం మాత్రమే భూమిలేనివారికి పంపకం చేయడం జరిగింది. కాని ఆ విధానం ఎన్నో ఆశల్ని సజీవంగా వుంచింది. కాని చంద్రబాబు హయాంలో పేదలకు పంచాల్సిన అలాంటి భూమిని కూడా వ్యవసాయ వ్యాపారం, టూరిజం మొదలైన రంగాలలో పెట్టుబడులు పెట్టి వ్యాపారం చేసేవారికే లీజులకివ్వడం జరుగుతోంది.

గిరిజనులు, తదితర అటవీ నివాసిత ప్రజల మనుగడకు అటవీ వనరులే ప్రధాన ఆధారం. 1980లో అటవీ వినియోగ చట్టం చేశాక అనేక చట్టపర అవరోధాలు ఏర్పడ్డాయి. కొన్ని అవకాశాలను ఇచ్చినట్టు పైకి కనిపించినా, ఆచరణలో అవన్నీ జిత్తులమారి ప్రయోగాలుగానే మారాయి. సామాజిక యాజమాన్యం పేరిట వ్యాపారపంటల సాగు మొదలయ్యింది. ప్రజలకి ఆ విధానాలు నిరంతర ఆదాయాన్ని సమకూర్చలేకపోయాయి.

నీటిపారుదల

సామాజిక లేదా ప్రజా నీటిపారుదల పనులు ఇటీవలిదాకా పంటలకు నీరు అందజేసేవి. చంద్రబాబు ఒక పద్ధతి ప్రకారం అలాంటి పనులకు విలువ లేకుండా చేశారు. భూగర్భ జలాల వినియోగం గురించి చురుకుగా ప్రచారం చేశారు. ప్రభుత్వ సాగునీటిపారుదల విధానంలో భాగంగా చేశారు. అందులో ఉద్దేశం, నీటిపారుదల రంగంలో ప్రైవేటీకరణకు ఏర్పాట్లు చేయడమే. శక్తివంతమైన బోరుబావుల వినియోగం ప్రైవేటు విద్యుత్ ఉత్పత్తిదారులకే లాభదాయకమయ్యింది.

విద్యుత్ ఉత్పత్తి, సరఫరా ప్రైవేటుపరమయ్యాయి. ప్రజా నీటిపారుదల పనులు మూతపడ్డాయి. అందువల్ల తెలంగాణ, రాయలసీమ ప్రాంతాలలో వర్షాధార రైతులందరూ వ్యవసాయం మానుకున్నారు.

విద్య - ఆరోగ్యం

చంద్రబాబు ప్రాధాన్యతా విధానాల వల్ల విద్య, ఆరోగ్యరంగాలను లాభదాయక వ్యాపారంగా నిర్వహించేందుకు అనుమతి లభించింది. విజన్ 2020 ఈ రెండు పెట్టుబడి రంగాలను రాష్ట్ర ఆర్థికవ్యవస్థను పెంపొందించే ఇంజన్లుగా పరిగణిస్తోంది. జీవితానికి ప్రాణాధారమైన ప్రజల జీవనహక్కులైన ఆ రెండు రంగాలనూ - రాష్ట్ర, ఆర్థికవ్యవస్థ పెరుగుదల ఇంజన్లుగటా పరిగణంచడం వల్ల ఏర్పడే పరిణామాల గురించి రెండో ఆలోచనే చేయలేదు. దీని ఫలితం 2003 వర్షాకాలంలో స్పష్టంగా కనిపించింది. కొత్తరకం మెదడువాపు వ్యాధి వరంగల్, కరీంనగర్ గ్రామీణ ప్రాంతాల్లో వ్యాపించింది. వందలాది పాఠశాల విద్యార్థులకి తక్షణ వైద్యసంరక్షణ అవసరమయ్యింది. 24 గంటల్లో తగిన వైద్యసహాయం అందితే వాళ్ళ ప్రాణాలు కాపాడటం సాధ్యమయ్యేదని ప్రతి ఒక్కరూ అంగీకరించారు. కాని ప్రజారోగ్యాన్ని నిర్లక్ష్యం చేయడం వల్ల- వ్యాధిసోకిన అనేక గ్రామాలకు ఆసుపత్రి సౌకర్యమే లేకుండాపోయేది. ప్రైవేటు ఆసుపత్రులు ఉన్నా అవి పేదలకు ఉచితంగా వైద్యం చేయడానికి సిద్ధంగాలేవు. ప్రపంచబ్యాంకు ఆరోగ్య విధానాల సిఫారసు ప్రకారం- ప్రభుత్వ బాధ్యత ప్రాథమిక ఆరోగ్య సంరక్షణ కల్పించడానికే పరిమితం. మిగిలినది ప్రైవేటు రంగానికే వదలిపెట్టాలి. దీన్నే చంద్రబాబు ప్రభుత్వం స్వీకరించింది.

క్షీణించిన ఉపాధి అవకాశాలు

ఉపాధి కల్పనకు సంబంధించి, స్వయం ఉపాధే ఉత్తమమని చంద్రబాబు విధానం ప్రకటిస్తోంది. కనీసం అందుకు కూడా ప్రభుత్వం మార్కెటింగ్ సలహాలు ఇవ్వడానికి మించి చేసే సహాయం ఏదీలేదు.

ప్రధాన సమస్య పెట్టుబడి. ఆర్థిక సంస్థలు ఏవీ కూడా నిరుద్యోగ యువకులకు అప్పులిచ్చి ఇబ్బందులు ఎదుర్కొనేందుకు సిద్ధంగా లేవు. మన పాలకులు ఎలాంటి ప్రశ్నలూ లేకుండా స్వీకరించిన ప్రపంచబ్యాంకు మరో సూచన ఇది! ప్రభుత్వరంగంలో ఉపాధి అవకాశాలు దారుణంగా మూసుకుపోయాయి. ప్రభుత్వ ఉద్యోగాలు ఒక పద్ధతి ప్రకారం ఏటేటా తగ్గుతూ వస్తాయని ప్రపంచబ్యాంకు వాగ్దానం చేసింది. ప్రభుత్వంలో ఖాళీ అవుతున్న ఉద్యోగాలను పోలీసు శాఖలో మినహా భర్తీ చేయడం లేదు. పరిపాలన కనీసస్థాయికి తగ్గిపోయింది. కావలసిన పనుల్ని కాంట్రాక్టుల ద్వారా, రోజుకూలీ ద్వారా చేయించడం జరుగుతోంది. ఇలాంటి కాంట్రాక్టు, తాత్కాలిక సిబ్బంది పర్మినెంట్ చేయమని కోరితే తొలగించే పరిస్థితి ఏర్పడింది. ఈ విషయంలో ప్రభుత్వ విచక్షణాధికారానికి అడ్డుచెప్పేందుకు కోర్టులు సిద్ధపడటంలేదు. కార్మిక చట్టాలకు మినహాయింపులు సులభంగా లభిస్తున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో సమాచార సాంకేతిక సంస్థలు ఉద్యోగుల్ని తొలగించాలంటే ఎలాంటి సక్రమ పద్ధతులూ పాటించవలసిన అవసరం లేని విధంగా మినహాయింపులు పొందాయి. హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ కూడా రోడ్లు శుభ్రం చేసే కాంట్రాక్టు మహిళా సిబ్బందికి కనీస వేతనాలు కూడా చెల్లించనక్కరలేకుండా మినహాయింపు పొందింది.

అణచివేత

ఇలాంటి ఆర్థిక సామాజిక విధానాలు అవలంబిస్తున్న ప్రభుత్వం నక్సలైట్ ఉద్యమం ద్వారా ఎదురైన రాజకీయ సవాళ్ళకి ఎలాంటి సమాధానం చెప్పలేకపోతోంది. ఇదంతా నక్సలైట్ల పట్ల పోలీసుల చర్యలకు ఎలాంటి శిక్షలూ లేకపోవడంలోనే ప్రతిబింబిస్తోంది. పోలీసులకు విశేషాధికారాలు కల్పించి, 'పోటా' లాంటి చట్టాలమాటున

వారు ఏం చేసినా శిక్షలు లేకుండా చేస్తోంది. అందుకు ప్రతిగా నక్సలైట్లు ముఖ్యంగా పీపుల్స్‌వార్ ఈ హింసను తిప్పికొట్టడమే సరైన సమాధానంగా భావించడంతో పరిస్థితులు ఇంకా విషమిస్తున్నాయి.

ఇప్పటికి ముప్పైఏళ్ళకుపైగా ఆంధ్రప్రదేశ్‌లో నక్సలైట్ పార్టీల కార్యకర్తలను చంపివెయ్యడం వారు పోలీసులతో జరిపిన ఎన్‌కౌంటర్లలో మరణించారని ప్రకటించడం ఒక సాధారణ విధానంగా మారింది. ఇలా నిజమైన కార్యకర్తలనేకాక, అనుమానితుల్ని సానుభూతిపరుల్ని కూడా చంపేస్తున్నారు. ఇది ఎలా ఉన్నప్పటికీ, గతంలో ఎన్నడూ లేనివిధంగా చంద్రబాబు ప్రభుత్వం ఇలాంటి హత్యల్ని సంవత్సరానికి 200కి పైగా సాగిస్తోంది. ఆఖరికి ఎమర్జన్సీ విధించిన 1975-77 సంవత్సరాల్లో ప్రాథమిక హక్కుల్ని అధికారయుతంగా రద్దుచేసినప్పుడు కూడా ఇలాంటి హత్యల సంఖ్య వంద, నూటయాభై దాటలేదు. ఇంకా ప్రముఖంగా గుర్తించవలసిన విషయం- ఇతర అవాంఛనీయ వర్గాల విషయంలో కూడా ఇలాంటి న్యాయాతీతంగా వ్యవహరించే పద్ధతినే అనుసరించడం! పోలీసులకు దొరికితే న్యాయస్థానానికి అప్పగించకుండా కాల్చిచంపడం అనేది ప్రస్తుత మూడువర్గాల విషయంలో జరిగిపోతోంది.

వాటిలో ఒకటి. కర్నూలు, కడప, అనంతపూర్ మొదలైన రాయలసీమ జిల్లాలలో సాగుతున్న హింసాయుత ఫ్యాక్షన్ యుద్ధాలలో పాల్గొనే సాధారణ సైనికులు. ఆర్థికంగా, రాజకీయంగా వర్ధిల్లే ఈ ఫ్యాక్షన్ నాయకులు కండబలం, ఆయుధబలం ఉన్నవారు. వీరు అధికార తెలుగుదేశం పార్టీకో లేదా వారి ప్రత్యర్థి పార్టీ అయిన కాంగ్రెస్‌కు చెందిన శాసనసభ్యులు. వారిలో చాలామంది ప్రాబల్య రెడ్డికులం వారే. పోలీసులు వారికి రక్షణ, ఎస్కార్టు కల్పిస్తారు. కానీ ఈ క్రూరక్రీడలో సాధారణ సైనికులు వెనుకబడిన, గిరిజన కులాలకు చెందినవారు, ఎలాంటి విచారణా లేకుండా కస్టడీలో మగ్గిపోయేవారూ!

రెండవ తరగతివారు- తెలుగుదేశం పార్టీ నాయకులపై హింసకు పాల్పడేవారు. వారిని పోలీసులు నేరుగా వేటాడి చంపేస్తుంటారు. ఇక మూడవ తరగతికి చెందినవారు- వృత్తిపరంగా దోపిడీ దొంగల ముఠాలకు చెందిన నిందితులు. ఈ ముఠాల్లో అట్టడుగు వర్గానికి చెందిన దేశదిమ్మరి కులాలవారు. వీరికి సామాజిక సానుభూతి అత్యల్పం. చంద్రబాబు హయాంలో వీరిని చట్టానికి అప్పగించేముందుగానేకాక, సంబంధిత కోర్టులు రిమాండ్‌కు పంపిన అనంతరం కూడా కాల్చిచంపెయ్యడం జరుగుతోంది. వీరిని జైలునుండి కోర్టుకు రిమాండ్ కాలం పెంచడానికో, విచారణకో తీసుకువెళ్ళేటపుడు చంపేస్తుంటారు. పరిపాలనాపతనం, శిక్షరాహిత్యం చంద్రబాబు హయాంలో చివరికి ఈ స్థాయికి చేరాయి.

### పోలీసు హింస

ఆంధ్రప్రదేశ్ పోలీసులు అత్యంత తీవ్రమైన చిత్రహింసా పద్ధతులను నిత్యం అమలుపరుస్తున్నారు. నక్సలైట్ కార్యకర్తలు, సానుభూతిపరులతో ఆరంభమైన ఈ పద్ధతులు ఇపుడు అలవాటుగా మారాయి. పోలీసుల నివాసగృహాలు, పోలీసు గెస్ట్‌హౌస్‌లు చిత్రహింసలకు ప్రత్యేక స్థలాలుగా మారాయి. ఎందుకంటే ఈ స్థలాలు ప్రజల నియంత్రణలోనివి కావు. శరీరంలో సున్నిత భాగాలకు కరెంట్ షాక్‌లు ఇవ్వడం అనేది ఆంధ్రప్రదేశ్ పోలీసు ఇంటరాగేషన్‌లో ఒక సాధారణ పద్ధతిగా అమలు జరుగుతోంది. నక్సలైట్ కార్యకర్తల్లో బలహీనులను ప్రలోభపెట్టి ప్రతి తిరుగుబాటుదార్లుగా మార్చడం, వారు పోలీసుల అండతో నేరగాళ్లుగా కొనసాగడానికి అనుమతించడం, ఈ హయాంలో ఒక పోలీసు పద్ధతిగా మారింది. మాజీ నక్సలైట్లు సాయుధ దళాల పోలీసుల ఏజెంట్లుగా వ్యవహరిస్తున్నారు. ఇంకా తమ పార్టీలో పనిచేస్తూ కూడా పోలీసు ఏజెంట్లుగా మారి, కామ్రేడ్లను చంపి, వారి ఆయుధాలతోనే బయటకు వస్తున్నారు.

ఈ ముఠాలన్నీ నిత్యం సివిల్ తగాదాల్లో జోక్యం చేసుకుని తీర్పులిస్తున్నాయి. వారివద్ద ఆయుధాలు ఉన్నాయని, వాటిని వాడటానికి సంకోచించరని, వీరికి పోలీసు రక్షణ కూడా ఉంటుందని తెలియడం వల్లే ఇలా సాగుతోంది.

### చట్టరాహిత్యానికి మరింత ప్రోత్సాహం

చంద్రబాబునాయుడు రాష్ట్ర అసెంబ్లీని వ్యవధికంటే ముందే రద్దుచేశారు. నక్సలైట్లతో పోరాడటానికే ఈ విధానపర నిర్ణయం తీసుకున్నట్టు ప్రకటించారు. అందువల్ల ఈ చట్టరాహిత్యం ఇంకా అవధులు మీరనున్నది. పాలకపక్షం తీసుకున్న ఈ నిర్ణయాన్ని పోలీసులు విజృంభించడానికి ఒక సూచనగా భావించాల్సి వస్తుంది. గత చరిత్ర ప్రకారం, ఈ పరిస్థితులకు పీపుల్స్‌వార్ ప్రతిస్పందిస్తూ తన హింసామార్గాన్ని మరింత తీవ్రం చేస్తుంది. ఇప్పటికే అధికారపక్షానికి చెందిన గ్రామస్థాయి కార్యకర్తల్ని లక్ష్యంగా చేసుకుని, వారు అధికారపక్షానికో లేదా దాని మిత్రపక్షం బిజెపికో చెందినవారన్న ఒకేఒక కారణంతో హత్యలు చేయడం మొదలుపెట్టింది కూడా. తమ స్వంత కార్యకర్తల్ని కూడా పోలీసు ఏజెంట్లుగా మారారన్న సాకుతో హత్యలు చేస్తోంది. అందువల్ల ఇక రానున్న రోజులు జీవించే ప్రాథమికహక్కుతో ప్రమేయం ఉన్న ఎవరికైనా గడ్డుకాలంగా మారబోతున్నాయి. ముఖ్యమంత్రిపై హత్యాయత్నం తదితర సంబంధిత విషయాలపై

*(తరువాయి 16వ పేజీలో)*

# వాజ్‌పేయ్‌జీ, అద్దంలో మీ ముఖం చూచుకోండి

- వి.హనుమంతరావు

**కాకిపిల్ల** కాకికి ముద్దు. 'మా ప్రభుత్వానికేం'? అంతా బావుంది. అంతా మంచిగుంది' అని ప్రధాని వాజ్‌పేయ్‌కి, బిజెపి అధ్యక్షులు వెంకయ్యనాయుడుకు అనిపించటంలో ఆశ్చర్యం లేదు. కాని ప్రజలేమనుకొంటున్నారు? ఏడు లక్షల గ్రామాల్లో వాస్తవమేమిటి అనేది ముఖ్యం. ఆ వాస్తవంలో మచ్చుకు కొన్ని విషయాలు ఈ కింద ముచ్చటించటం జరుగుతుంది. ఈ వాస్తవాలన్నీ ఎవరో, ఏ సంస్థో చేసిన సర్వే నుంచి ఉటంకించినవి కావు. నేరుగా, కేంద్ర ప్రభుత్వ ఎకనామిక్ సర్వే 2002-03 నుంచి సేకరించిన గణాంకాలు. ఇది మీరు తయారుచేసిన అద్దం. అందులోనే మీ ముఖం చూచుకోండి.

**రహదారులు**

ప్రధాని గ్రామీణ రహదారుల పథకం డిసెంబరు 2000లో ప్రారంభించారు. దేశంలో రహదారులు లేని జనావాసాలు 1.6లక్షలున్నాయని, 10వ ప్రణాళిక అంతం నాటికి 60వేల కోట్ల రూపాయల ఖర్చుతో పూర్తి చేయాలని నిర్ణయించారు. డిసెంబరు 2002 నాటికి, అంటే రెండు సంవత్సరాల నాటికి రు.3321.6కోట్లు ఖర్చుచేసి 14,572 పనులను మాత్రం పూర్తిచేశారు. పదవ ప్రణాళికలో ఇంక మిగిలిన మూడు సంవత్సరాల్లో 1.41లక్షల రహదారులను 57వేల కోట్ల రూపాయలు ఖర్చు చేసి పూర్తి చేయాలన్న మాట. స్వయంగా ప్రధాని పేరుతో ప్రారంభించిన పథకానికి పట్టిన గతి ఇది. డీసెల్ ఆయిల్ మీద సెస్ విధించి దానిలో 50శాతం ఈ పథకం కోసం ఖర్చు చేయలన్నారు. కాని అప్పుడే కాళ్లు లాగాయి. నిధులు నిండుకొన్నాయి. ప్రపంచబ్యాంకుకు ఏషియన్ డెవలప్‌మెంట్ బ్యాంకుకు ముష్టెత్తుకోవడానికి బయలుదేరింది ప్రభుత్వం. నిజానికిది ఆ గ్రామ ప్రజలను సమీకరించి చేయాల్సిన పని. కాని వాజ్‌పేయ్ ప్రభుత్వం సాధించేసిన అభివృద్ధితో ఈ గ్రామాల ప్రజలు తిని తొంగుండి వుండాలి. ఈ పురోగతి చూచేనా 'అంతా మంచిగుంది' అని అనుకోమంటున్నారు?

**విద్యుచ్ఛక్తి**

దేశంలో 87శాతం గ్రామాలను విద్యుదీకరించామని, ఇంకా 77,142 గ్రామాలను విద్యుదీకరించాలని ప్రభుత్వం చెబుతోంది. 5.1లక్షల గ్రామాలను విద్యుదీకరించామంటే దానర్థం ఆ గ్రామాల్లో అన్ని ఇళ్లను విద్యుదీకరించినట్లు కాదు. 2007 నాటికి అన్ని గ్రామాలు విద్యుదీకరించి 2012 నాటికి అన్ని ఇళ్లకు విద్యుత్ సరఫరా పూర్తిచేయాలని ప్రభుత్వం చెపుతోంది. ఇందుకు కావాల్సిన నిధులను కేంద్రం రాష్ట్రాలకు విడుదల చేసినట్లు చెబుతోంది. రాష్ట్ర ప్రభుత్వాలు ఏం చేస్తున్నాయో తెలియదు. అంటే గ్రామాల్లో అన్ని ఇళ్లకు విద్యుచ్ఛక్తి అందాలంటే ఇంకో ఎనిమిది సంవత్సరాలు ఆగాలి.

**సామాజిక సేవలు**

విద్య, వైద్యం, నీటి సరఫరా, ఎస్సీ, ఎస్టీ, బి.సి.సంక్షేమ కార్మికులు, గ్రామీణాభివృద్ధి, కనీస ప్రాథమిక సౌకర్యాలు, ప్రధాని గ్రామోదయ యోజన, ప్రధాని గ్రామీణ రహదారి యోజన-వీటన్నిటికి కలిపి 2002-03 బడ్జెట్ అంచనా ప్రకారం రు.45642కోట్లు కేటాయించారు. అబ్బో చాలా ఖర్చు చేస్తున్నారే అని అనిపిస్తుంది. కాని కేంద్రం చేసే మొత్తం ఖర్చులో ఇది 11.1శాతం మాత్రమే. అంటే ప్రతి నూరు రూపాయల ఖర్చులో, ఇన్ని సామాజిక సేవలకు ఖర్చు అయ్యేది 11 రూపాయలు మాత్రమే. మరో విశేషమేమిటంటే గత నాలుగు సంవత్సరాలుగా ఈ ఖర్చు పెరుగుదల లేదు. 11రూపాయల దగ్గరే స్థంబించిపోయింది. స్థూల జాతీయాదాయంలో ఈ ఖర్చుశాతం 1.9శాతం. ప్రణాళికల్లో ఈ రంగానికి ఖర్చు పెట్టిన మొత్తం స్థూల జాతీయాదాయంలో ప్రస్తుత మార్కెట్ ధరల ప్రకారం గత నాలుగు సంవత్సరాలుగా 1.1 నుంచి 1.2శాతం దగ్గరే తచ్చాడుతుంది. ఈపాటి ఖర్చుతోనే అంతా మంచిగా అయిపోద్దా? యు.ఎన్.డి.పి. మానవాభివృద్ధి నివేదిక ప్రకారం 173 ప్రపంచ దేశాల్లో భారతదేశం 124వ స్థానం వుందంటే అది మంచిగా వుందనుకోవాలా?

స్థూల రాష్ట్ర జాతీయాదాయంలో ఆరుశాతం విద్యకు, మరో ఆరుశాతం వైద్యానికి ఖర్చు చేయాలని అనేక కమిటీలు సిఫార్సు చేశాయి. కాని 99-00లో 3.3శాతం మాత్రమే ఖర్చుచేయగా, ఆ తర్వాత అన్ని సంవత్సరాల్లో 3.1శాతానికి దిగజారిపోయింది. అలాగే వైద్యం కోసం గత రెండు సంవత్సరాలుగా 1.4శాతం దగ్గరే స్థంభించిపోయింది. కేంద్ర ప్రభుత్వం మొత్తం ఖర్చులో విద్యకోసం ఖర్చు 99-00లో 12.3శాతం నుంచి గత సంవత్సరం 10.3శాతానికి పడిపోగా, గత మూడు సంవత్సరాల్లో వైద్యం కోసం 4.8శాతం వద్దనే దిగబడిపోయింది.

మానవీయ కోణం నుంచి చూస్తే ఇలా దిగజారిపోతుంటే ఆర్థిక సంస్కరణలకు మానవీయత వుందని, ఎకనమిక్ సర్వే ఉందని అంటూందంటే ఈ ప్రభుత్వానిది నాలుకా, తాటిపట్టా అని అడగాలనిపిస్తుంది.

కేంద్రంలో బిజెపి అధికారంలోకి వచ్చిన తర్వాత ప్రజాకర్షక పథకాల జోరు ఎక్కువైపోయింది. ఇంగ్లీషులో వున్న పథకాల పేర్లన్నీ హిందీలోకి మారిపోయాయి. ఈ పథకాలన్నీ పేదరిక నిర్మూలనకు తోడ్పడతాయని అన్నారు. 02-03 ఎకనమిక్ సర్వే ప్రకారం ఈ పథకాలు ఎంత సాగసుగా అమలు అయ్యాయో చూడండి.

స్వర్ణ జయంతి గ్రామ స్వరోజ్‌గార్ యోజన: ఏప్రిల్ 1999లో ప్రారంభించిన స్వయం ఉపాధి పథకానికి డిసెంబరు 02 వరకు

రు.4335కోట్లు కేటాయిస్తే రు.3497కోట్లు మాత్రమే ఖర్చు అయి 32.48లక్షల మంది లాభం పొందారట. అంటే సంవత్సరానికి ఒక్కొక్కరికి అందిన సహాయం రు.3643లు లేదా నెలకు రు.300రూపాయలు. 300రూపాయలతోనే పేదరికపు రేఖ పైకి వచ్చేసారా?

<u>సంపూర్ణ గ్రామీణ్ రోజ్‌గార్ యోజన:</u> సెప్టెంబరు 2001లో ప్రారంభమైంది. ప్రజలకు పని కల్పించటం లక్ష్యం. ప్రతి సంవత్సరం 100కోట్లు పనిదినాలు కల్పించాలి. 01-02లో 22లక్షల టన్నులు బియ్యం కేటాయిస్తే 13.18లక్షల టన్నులు, 12.49లక్షల టన్నులు గోధుమ కేటాయిస్తే, 5.64లక్షల టన్నుల గోధుమ మాత్రమే రాష్ట్రాలు తీసుకొని వెళ్లాయి. వీటికయ్యే ఖర్చులో 87.5శాతం ఖర్చు కేంద్రమే భరిస్తుంది అయినా రాష్ట్రాలు పూర్తి కోటాను తీసుకొని వెళ్లలేదంటే రాష్ట్రాల ఆర్థిక పరిస్థితి ఎలా వుందో ఊహించుకోవచ్చు. ఈ పథకం కింద వర్షాభావ పరిస్థితులేర్పడిన రాష్ట్రాలకు 47.63లక్షల టన్నుల గింజలను కేంద్రం ఉచితంగా సరఫరా చేసింది. దీనికే "పనికి ఆహారపథకం" అని చంద్రబాబు పేరుతో, ఆ తిండి గింజలతో కాంట్రాక్టర్లు పచ్చచొక్కాల జేబులు నింపేశారు.

<u>ప్రధానమంత్రి గ్రామోదయ యోజన:</u> 00-01లో ప్రారంభించిన ఈ పథకం లక్ష్యం గ్రామాల్లో మానవీయతను ఉద్ధరించటం. గత రెండు సంవత్సరాల్లో కేటాయించిన సొమ్ము లెక్కలు ఇచ్చారు గాని ఎంత ఖర్చు చేశారో, ఎంతమందిని ఉద్ధరించారో లెక్కలు ఇవ్వలేదు. బహుశా చెప్పుకొంటే సిగ్గుపడాల్సినంత తక్కువ ఖర్చు అయి వుండాలి.

<u>ప్రధానమంత్రి గ్రామీణ ఆవాస్:</u> గ్రామాలనుద్ధరించటం, ముఖ్యంగా గూడు కట్టించటం లక్ష్యం. కేటాయింపు 01-02లో రు.407కోట్లు, ఖర్చు చేసింది రు.291కోట్లు మాత్రమే.

<u>ప్రధానమంత్రి గ్రామోదయ యోజన:</u> గ్రామీణ మంచినీటి సరఫరా పథకం. దీనికి ఎంత కేటాయించారో ఎంత ఖర్చు చేశారో లెక్కలు కూడా ఇవ్వలేదు.

<u>అంత్యోదయం అన్న యోజన:</u> డిసెంబరు 2001లో ప్రారంభించిన ఈ పథకం కింద నిర్దేశించిన ప్రజా పంపిణీ పథకం (జెపిడిఎస్) కింద కుటుంబానికి నెలకు 35కిలోల బియ్యం కిలో మూడు రూపాయలకే ఇవ్వాలి. ఈ బియ్యాన్ని కేంద్రమే సరఫరా చేస్తుంది. రాష్ట్రాలకు ఏం రోగం వచ్చిందో కాని 02లో 19.60లక్షల టన్నులు ఆహారధాన్యాలు కేటాయిస్తే, 16.78లక్షల టన్నులు మాత్రమే తీసుకొని వెళ్లాయి.

<u>అన్నపూర్ణ:</u> వయోవృద్ధులకు పెన్షన్‌కు అర్హులైనా, అందుకోలేని వారికి ప్రతినెలా 10కిలోల బియ్యం ఉచితంగా ఇవ్వటం ఈ పథకం ఉద్దేశం. 01-02లో 162వేల టన్నులు తిండిగింజలను కేటాయించినా కేవలం 93వేల టన్నులే రాష్ట్రాలు తీసుకొన్నాయి. ఈ పథకాన్ని ప్రస్తుతం రాష్ట్ర ప్రభుత్వాలకు బదిలీచేశారు. ఉచితంగా ఇస్తేనే పూర్తిగా తీసుకొని వెళ్లని రాష్ట్రాలు, తమంతట తాము ఉచితంగా ఇస్తాయా?

<u>స్వర్ణ జయంతి షహరి రోజ్‌గార్ యోజన:</u> పట్టణాల్లో స్వయం ఉపాధి కల్పన కల్పించటం లక్ష్యం. 01-02లో బడ్జెట్‌లో రు.168కోట్లు కేటాయించి, సవరించిన అంచనాతో కేంద్రమే రు.45.50కోట్లకు తగ్గించగా, రాష్ట్రాలు తీసుకొన్నది రు.39.21కోట్లు మాత్రమే. ఇది మంచంకోళ్ల కథలా వుంది.

ఇదండీ, వాజ్‌పేయ్ గారూ, తమ ప్రభుత్వం మా పేరుతో ప్రారంభించి అమలుపరుస్తున్న పథకాల తీరు. మా సంగతి అలా వుంచి, అంతా బాగానేవుందని మీకు అనిపిస్తుందా వాజ్‌పేయ్‌జీ? మీ ప్రభుత్వం, మీరు అమలుపరుస్తున్న సంస్కరణలు సాధించిన అభివృద్ధి కథలు ఇంకా ఎన్నో, ఎన్నెన్నో వున్నాయి.

★ దేశంలో తిండిగింజల లభ్యత నానాటికి తీసికట్టుగా వుంది. సంస్కరణలు ప్రారంభించిన 1991లో తలసరి తిండి గింజలు రోజువారీ లభ్యత (దీనర్థం తింటున్నారని కాదు) 510.1 గ్రాములు నుండి 2002లో 414.1 గ్రాములకు పడిపోయింది. స్వతంత్రం వచ్చిన తర్వాత 1953లో లభ్యత 412.6గ్రాములు వాజ్‌పేయ్ హయాంలోనే చూస్తే 1999లో 465.7గ్రాముల నుంచి 2001లో 414.1గ్రాములకు తగ్గింది. ఇదే సంవత్సరాల మధ్యకాలంలో ప్రభుత్వ చవక దుకాణాల ద్వారా విడుదల అయిన తిండి గింజలు 17.7మిలియన్ టన్నుల నుంచి 2001లో 13.2మిలియన్ టన్నులకు జారిపోయింది.

★ పారిశ్రామిక ఉత్పత్తుల సూచి కూడా అదే ధోరణిలో వుంది. 98-99 నుంచి 99-00 మధ్య ఈ సూచి తొమ్మిది పాయింట్లు పెరిగితే, ఆ తర్వాత 99-00/00-01 మధ్య ఈ పెరుగుదల ఎనిమిది పాయింట్లకు, 01-02 నాటికి అయిదు పాయింట్లకు దిగజారింది.

★ ప్రభుత్వరంగంలో ఉద్యోగాలు 98లో 194.18లక్షలు, 99లో 194.15లక్షలు, 2000లో 193.14లక్షలు, 2001లో 191.38లక్షలు. వేరే వ్యాఖ్యానం అవసరమా? ప్రయివేటు రంగంలో మూడు సంవత్సరాల నుంచి 86లక్షల చుట్టూ పరిభ్రమిస్తుంది.

★ వ్యవసాయానికి బ్యాంకు రుణాలు 1998-2001 మధ్యకాలంలో ఎప్పుడో నిర్దేశించిన 18శాతం చేరుకోలేదు.

★ టోకు ధరల సూచి 98-99లో 140.7 అయితే 02-03 డిసెంబరు నాటికి 167కు పెరిగింది. వినిమయదారుల ధరల సూచి 98-99 నుంచి 01-02 మధ్యకాలంలో పారిశ్రామిక కార్మికులకు 414 నుంచి 468కు, పట్టణ శ్రామికేతర ఉద్యోగులకు 337 నుంచి 395కు, వ్యవసాయ కార్మికులకు 293 నుంచి 309కు పెరిగింది. (వీటన్నిటికీ బేస్ ఇయర్స్ వేర్వేరుగా వున్నాయి). ఇవన్నీ కొన్ని ఉదాహరణలు మాత్రమే.

వాజ్‌పేయ్‌జీ! తమరు కాస్త తమ ముఖాన్ని అద్దంలో చూచుకొంటారా?

(పైన పేర్కొన్న గణాంకాలన్నీ 2002-03 కేంద్ర ప్రభుత్వ ఎకనమిక్ సర్వే నుంచి) ○

# సెన్సెక్స్ విన్యాసాలు

-శ్రీనివాసన్ నామసేవ

**'సెన్సెక్స్'** అన్న పదం 'సెన్సిటివ్ ఇండెక్స్'లోని మొదటి పదంలోని నాలుగు అక్షరాలు రెండవ పదంలోని చివరి రెండు అక్షరాలతో కలిసి ఏర్పడింది. క్రొత్త సంవత్సరానికి అత్యంత ఉత్సాహంతో స్వాగతం పలికి జనవరి 2వ తేదీన ప్రప్రథమంగా 6000ల పైచిలుకు పాయింట్లతో ముగిసిన సెన్సెక్స్ సంక్రాంతి దాటగానే నీరుగారిపోయింది. ఇన్వెస్టర్లను భయాందోళనలకు గురిచేసింది. ఆటు స్టాక్ మార్కెట్ పండితులకు, ఇటు స్టాక్ మార్కెట్టుకు దూరంగా వున్న సామాన్యులకు కూడా బిఎస్సీ (బొంబాయి స్టాక్ ఎక్చేంజ్ సెన్సెక్స్) తరచూ హెచ్చు తగ్గులు సంభ్రమాశ్చర్యాలనే కాక, అసలు ఈ సెన్సెక్స్ కథా కమామిషు ఏమిటో తెలుసుకోవాలనే కుతూహలాన్ని కల్గించింది. అందరిలో- ఈ సెన్సెక్స్ అంటే ఏమిటి? ఎలా? ఎప్పుడు ఏర్పడింది? ఎందుకు పతనమవుతోంది? మరలా 'స్కాం'లు ఏమైనా వెలుగు చూశాయా? అసలు ఈ సెన్సెక్స్ మార్కెట్ వాస్తవికతను ప్రతిబింబిస్తోందా? ఎన్నిసార్లు 6000పాయింట్లను దాటింది? అన్న ఎన్నో ప్రశ్నలు సందేహాలు.

## సెన్సెక్స్ అంటే!

సెన్సెక్స్ అన్నది ఒక సూచీ సంఖ్య. ఇది ఇండియన్ కేపిటల్ మార్కెట్టు స్థితిని చూపే ఒక భారమితి(బెరామీటర్). నేటికి ఇండియన్ కేపిటల్ మార్కెట్టు 128సంవత్సరాలు పూర్తిచేసుకుంది. 1875సంవత్సరంలో కేవలం 318మంది సభ్యులు, ఒక్కొక్కరు ఒక్క రూపాయి చొప్పున, సభ్యత్వం చెల్లించి 'ముంబయి స్టాక్ ఎక్స్చేంజిని' ప్రారంభించారు. ఆనాటి నుంచి ఈనాటి వరకు భారతదేశ కేపిటల్ మార్కెట్ హెచ్చుతగ్గులను, ఒడుదుడుకులను ఇతర సమస్యలను ఎదుర్కొంటూనే ఉంది. 2000సంవత్సరం నుంచి "స్కాం" భూతం బాగా భయపెట్టింది. అసలు వీటి ప్రభావాలు స్టాక్ మార్కెట్టుపై ఎంతెంత వున్నాయో తెలుసుకోవాలంటే 1985 వరకు ఎలాంటి కొలబద్ద వుండేది కాదు.

1986లో ముంబయి స్టాక్ ఎక్స్చేంజి "వాటా సూచి సంఖ్య"ను (స్టాక్ ఇండెక్స్) రూపొందించింది. ఈనాటికి సెన్సెక్స్ పద్దెనిమిదవ వసంతంలోకి అడుగిడినట్టే.

ఈ సెన్సెక్స్‌ను రూపొందించడంలో శాస్త్రీయ పద్ధతులే గాక అంతర్జాతీయంగా ఆమోదింపబడే విధానాలను పరిగణించడం జరిగింది.

అతి పెద్ద కంపెనీలు, వాటాల ద్రవ్యత్వము మరియు పరిశ్రమలకు ప్రాతినిధ్యం వహించగల లక్షణాలు వున్న 30 కంపెనీల వాటాలను సెన్సెక్స్ రూపకల్పనకు ఎన్నుకున్నారు. 1978-79సంవత్సరాన్ని ఆధార సంవత్సరంగా తీసికొని, ఆధార సంవత్సర విలువను 100గా పరిగణించారు. అంటే 1978-79 సంవత్సరానికి సెన్సెక్స్ విలువ 100పాయింట్లు అన్నమాట. అటుపిమ్మట ఈ 'సెన్సెక్స్' ముద్రణ మరియు ఎలక్ట్రానిక్ మీడియాల కారణంగా విశేష ప్రాచుర్యం పొందింది.

మొట్టమొదట 'సెన్సెక్స్' లెక్కించడంలో "పూర్తి మార్కెట్ మూలధనీకరణ" అన్న ప్రాతిపదిక తీసుకున్న తర్వాత సెప్టెంబరు 1, 2003 నుండి అంతర్జాతీయంగా ఇతర స్టాక్ ఎక్స్చేంజిలలో అవలంభించిన "ఫ్రీ ఫ్లోటో మార్కెట్ మూలధనీకరణ" విధానం ఆధారంగా 'సెన్సెక్స్' లెక్కించడం జరిగింది. ఇతర అంతర్జాతీయ స్టాక్ మార్కెట్ సూచి సంఖ్యలు ఏవంటే 'ఎంఎస్‌సిఐ', 'ఎఫ్‌టిఎస్ఇ', 'ఎస్‌టిఓఎక్స్ఎక్స్', 'ఎస్ అండ్ పి', 'డౌ జోన్స్' మొదలైనవి. ఇండియన్ ఇన్వెస్టర్లే కాక విదేశీ ఇన్వెస్టర్లు కూడా 'సెన్సెక్స్'ను ఇండియన్ స్టాక్ మార్కెట్ యొక్క కీలకనాడిగా గుర్తించారు. ఈ 'సెన్సెక్స్' ఇండియాలో అతి పురాతనమైనది మాత్రమే కాక, 1979 తర్వాత కాలానికి స్టాక్ మార్కెట్టుకు చెందిన కాలశ్రేణుల గణాంకాలను కూడా ఇవ్వగల్గుతోంది. అంతేకాక, 1990 తర్వాత కాలంలో స్టాక్ మార్కెట్‌లోని "బుల్స్" మరియు 'బేర్స్' ప్రవర్తనలు పెచ్చు పెరిగిపోవటం, మార్కెట్‌లో ఒడుదుడుకులు, మార్కెట్ తిరిగి పుంజుకోవడం వంటి అనేక సంఘటనలకు 'సెన్సెక్స్' అత్యంత సమంజసంగా ప్రతిస్పందించడమే కాక, అన్నింటిని ప్రతిబింబించింది కూడా.

సెన్సెక్స్‌ను లెక్కవేయడంలో సరళతర అంకగణిత పరికర్మలు వున్నప్పటికి, సెన్సెక్స్‌ను లెక్కించడానికి ఎంపిక చేసికొన్న కంపెనీలు బోనస్ చెల్లించి చేసికొన్న కంపెనీలు బోనస్ చెల్లించినప్పుడు, లెదా 'రైట్స్ వాటాలు' జారీ చేసినప్పుడు, సరికొత్తగా అదనపు మూలధన సేకరణకు వాటాలు జారీచేసినప్పుడు, వాటాలను విభజించినప్పుడు, పునర్నిర్మాణం సందర్భంలోనూ 'సెన్సెక్స్'ను కూడా సర్దుబాటు చేయాల్సివుంటుంది. అలా సర్దుబాటు చేయకపోతే 'సెన్సెక్స్' విలువలు నిరవధికంగా వుండక అంతరాయాలను కల్గి వుంటాయి. అందువల్ల

'సెన్సెక్స్' విలువను పరిరక్షించడానికి, అది మార్కెట్ వాస్తవికతను ప్రతిబింబింపచేసే విధంగా వుంచడానికి గాను 'ఇండెక్స్ సెల్' మరియు 'ఇండెక్స్ కమిటీ' ఉన్నాయి.

'ఇండెక్స్ సెల్' ఎప్పటికప్పుడు 'సెన్సెక్స్' మరియు ఇతర బిఎస్ఈ ఉపసూచికల లక్షణాలను, వాటి నిరవధికతను కాపాడుతుంది.

'ఇండెక్స్ కమిటి' ఇండెక్స్ విధానాన్ని నిర్దేశిస్తుంది. తను నిర్దేశించిన విధానాలకు అనుగుణంగా ఇండెక్స్‌సెల్ దినసరి ఇండెక్స్ విలువలను, వాటి లక్షణాలను కాపాడే చర్యలు తీసికుంటుందో లేదో చూస్తుంది. ఈ ఇండెక్స్ కమిటీలో కాపిటల్ మార్కెట్ నిపుణులు, విద్యావేత్తలు, వివిధ మ్యూచువల్ ఫండ్ సంస్థల నిధి నిర్వహణ వేత్తలు, ఆర్థికరంగ పాత్రికేయ, మార్కెట్ లావాదేవీలలో పాల్గొనేవారు, బోర్డుమెంబర్లు, ఎక్స్ఛేంజి పరిపాలనా రంగ సభ్యులు ఉంటారు.

మార్కెట్‌లో లావాదేవీలు జరిగేటప్పుడు ఎప్పటికప్పుడు సరికొత్త సెన్సెక్స్ విలువలు ప్రతి 15సెకండ్లకు లావాదేవీలు జరిపే అన్ని కేంద్రాలకు కంప్యూటర్ నెట్‌వర్క్ ద్వారా ఆన్‌లైన్‌లో వచ్చి చేరుతాయి.

<u>సెన్సెక్స్‌లో గల కంపెనీలు</u>

సెన్సెక్స్ మార్కెట్ వాస్తవికతను ప్రతిబింబించటానికి గాను 30 కంపెనీలను ఎంపిక చేశారు. 1.1.86 నుండి పదిసార్లుగా ఈ 30 కంపెనీలలో మార్పులు జరిగాయి. ప్రస్తుతం 10 నవంబరు 2003 నుండి కింది కంపెనీలు సెన్సెక్స్‌లో కొనసాగుతున్నాయి. అవి 1. ఎసిసి 2. బజాజ్ ఆటో 3. భారతీ టెలీ వెంచర్స్ 4. బిహెచ్ఇఎల్ 5. బిఎస్ఇఎస్ 6. సిప్లా 7. డాక్టర్ రెడ్డిలాబ్స్ 8. గ్రాసిమ్ 9. గుజాంబు సిమెంట్స్ 10. హెచ్‌డిఎఫ్‌సి 11. హెచ్‌డిఎఫ్‌సి బాంక్ 12. హీరోహోండా 13. హిందూ లివర్ 14. హిండాల్కో 15. హెచ్‌పిసిఎల్ 16. ఐసిఐసిఐ బ్యాంక్ 17. ఇన్ఫోసిస్ టెక్నాలజీస్ 18. ఐటిసి లిమిటెడ్ 19. ఎల్అండ్‌టి 20. ఎమ్‌టిఎన్ఎల్ 21. ఒఎన్‌జిసి 22. రాన్‌బాక్సీ లాబ్స్ 23. రిలయన్స్ ఇండస్ట్రీస్ 24. సత్యం కంప్యూటర్స్ 25. స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా 26. టాటా మోటార్స్ 27. టాటా పవర్ 28. టిస్కో 29. విప్రో 30. జి టెలిఫిల్మ్స్

30 కంపెనీలను ఎంపిక చేసుకోవడానికి క్రింది ప్రాతిపదికలు పరిగణించారు. 1. కంపెనీ వాటాల లావాదేవీలు ఎంత తరుచుగా జరుగుతాయి 2. గత సంవత్సరంలో సగటు దినసరి లావాదేవీల సంఖ్య 3. గత సంవత్సరంలో సగటు దినసరి లావాదేవీల విలువలు అత్యధికంగా గల మొదటి 150 కంపెనీలు 4. అన్ని పారిశ్రామిక రంగాలకు ప్రాతినిధ్యం ఉండేలా చూడటం 5. కనీసం ఒక సంవత్సరం ఎక్స్ఛేంజిలో 'లిస్టింగ్' అయి ఉండటం 6. ఇండెక్స్ కమిటీ దృష్టిలో కంపెనీ రికార్డు సరైనదిగా ఉండటం.

<u>సెన్సెక్స్ పతనం ఎందుకు జరుగుతుంది?</u>

ఇంత పకడ్బందీగా సెన్సెక్స్‌ను రూపొందించినా, దాని విలువను, లక్షణాలను నిరంతరం పరిరక్షిస్తున్నా అది అందరి వూహలకు అందని విధంగా విన్యాసాలు చేస్తూనే వుంటుంది. ఎన్నోసార్లు పతనం చెందుతూనే వుంటుంది. ఈవిధంగా 'సెన్సెక్స్' ఆకస్మికంగా మార్పులకు చెందటానికి కారణాలు అనేకం. అందులో కొన్ని-

1. స్వదేశీ, విదేశీ ఆర్థిక సంస్థలు వాటివద్ద వున్న ఈక్విటి వాటాలను హఠాత్తుగా అధిక సంఖ్యలో అమ్మివేయటం లేదా కొనుగోలు చేయడం.
2. కంపెనీలకు లాభాలు వచ్చిన సందర్భంలో వాటా విలువలు గణనీయంగా పెరిగినట్టయితే, వాటాలు అమ్మకాలకు లోను కావడం.
3. నేషనల్ స్టాక్ ఎక్స్ఛేంజిలో గానీ, ముంబయి స్టాక్ ఎక్స్ఛేంజిలో గానీ 'టెక్నికల్ స్నాగ్' ఏర్పడి 'ఫ్యూచర్స్ అండ్ ఆప్షన్స్' లేదా 'క్యాష్' సెగ్మెంట్‌లో లావాదేవీలు పాక్షికంగా గానీ, పూర్తిగా గాని నిలిచిపోవడం.
4. విదేశీ ఇన్వెస్టర్లు ఏ కారణాల వల్లనైనా అమ్మివేస్తారన్న భయం కల్గినట్టయితే
5. 'స్కాం'లు ఏవైనా వెలుగు చూసినప్పుడు గతంలో హర్షద్ మెహతా, కేతన్‌పరేఖ్‌ల కారణంగా 'స్కాం'లు.
6. కంపెనీల ఫలితాలు ముందుగా 'లీక్' అయినట్టయితే
7. ప్రభుత్వంలో లేదా మంత్రివర్గంలో మార్పులు జరుగుతాయన్న వార్తలు లేక పుకార్లు వచ్చినా
8. ఆర్థిక విధానం, విత్త విధానం, ఎగుమతి విధానాలు ప్రకటించినప్పుడు.
9. బడ్జెట్‌కు ముందు.
10. విదేశీ లేదా అంతర్జాతీయంగా ఆర్థికరంగాన్ని ప్రభావితం చేసే సంఘటనలు జరిగినప్పుడు.
11. 'సార్స్' వంటి వ్యాధుల కారణంగా ఎగుమతి దిగుమతులు ప్రభావితం అయినప్పుడు.
12. ఋతుపవనాల ప్రభావం.
13. ఇతరదేశాలు ఎగుమతి దిగుమతులపై విధించిన ఆంక్షలలో మార్పులు చేసిన సందర్భంలో.
14. కంపెనీలు త్రైమాసిక అర్థసంవత్సర, వార్షిక ఆర్థిక ఫలితాలు ప్రకటించినప్పుడు.

మరే ఇతర కారణాలు ఆర్థిక, పారిశ్రామిక రంగాలను ప్రభావితం చేసేవి అయినా సెన్సెక్స్‌ను హెచ్చుతగ్గులకు లోబడేట్టు చేస్తాయి.

కానీ "పెరుగుట విరుగుట కొరకే", "పడ్డవాడు చెడ్డవాడు కాదు, చెడినవాడు కాదు" అన్న రెండు సామెతలు 'సెన్సెక్స్'కు పూర్తిగా వర్తిస్తాయి. అందుకే వివిధ మనస్తత్వాలు, వ్యూహాలు వున్న ఇన్వెస్టర్లు అమ్మినవాటినే తిరిగికొంటూ 'సెన్సెక్స్' మరింత పతనం కాకుండా, మరింతగా పెరిగిపోకుండా చూస్తారు. ఈ ఇన్వెస్టర్లలో 'డీ ట్రేడర్లు', 'షార్ట్ టర్మ్ ఇన్వెస్టర్లు', 'లాంగ్‌టర్మ్ ఇన్వెస్టర్లు', మ్యూచువల్ ఫండ్స్, ఆర్థిక సంస్థలు బ్రోకర్లు ఉంటారు.

1991 నుండి 23 జనవరి వరకు సెన్సెక్స్ ఏవిధంగా ప్రతి సంవత్సరం ప్రారంభమై, సంవత్సరంలో హెచ్చు తగ్గులకు లోనై, ఏవిధంగా ముగిసిందో పట్టిక 1లో ఇవ్వటం జరిగింది.

1999లో మొదటిసారిగా 5000 పాయింట్లు దాటిన 'సెన్సెక్స్' అందరి దృష్టిని స్టాక్‌మార్కెట్ల వైపు ఆకర్షించింది. స్కాముల కారణంగా 2001, 2002 సంవత్సరాలలో ఇన్వెస్టర్లు మార్కెట్టుకు కాస్త దూరంగానే ఉండిపోయారు.

పట్టిక 1

సెన్‌సెక్స్ పాయింట్లు (1991-2004)

| సంవత్సరం | ప్రారంభపు విలువ | గరిష్ట విలువ | కనిష్ట విలువ | ముగింపు విలువ |
|---|---|---|---|---|
| 1991 | 1027.38 | 1955.29 | 947.14 | 1908.85 |
| 1992 | 1957.33 | 4546.58 | 1945.48 | 2615.37 |
| 1993 | 2617.78 | 3459.07 | 1980.06 | 3346.06 |
| 1994 | 3436.87 | 4643.31 | 3405.88 | 3926.90 |
| 1995 | 3910.87 | 3943.66 | 2891.45 | 3110.49 |
| 1996 | 3114.08 | 4131.22 | 2713.12 | 3085.20 |
| 1997 | 3096.65 | 4605.41 | 3096.65 | 3658.98 |
| 1998 | 3658.34 | 4322.00 | 2741.22 | 3055.41 |
| 1999 | 3064.95 | 5150.99 | 3042.25 | 5005.82 |
| 2000 | 5209.54 | 6150.69 | 3491.55 | 3972.12 |
| 2001 | 3990.65 | 4462.11 | 2594.87 | 3262.3 |
| 2002 | 3262.01 | 3758.27 | 2828.48 | 3377.28 |
| 2003 | 3383.85 | 5920.76 | 2904.44 | 5838.96 |
| 2004 | 5872.48 | 6249.60 | 5567.68 | 5816.64 |

2000 సంవత్సరంలో సెన్సెక్స్ ఎన్నడూ లేనంతగా 6000 పాయింట్లు చేరి తిరిగి తర్వాత 3972 పాయింట్ల వరకు పతనం చెందడం జరిగింది. ఈవిధంగా అత్యంత గరిష్ట పాయింట్లు పొంది తిరిగి అనుకోని విధంగా పతనం చెందడం చక్రీయంగా జరుగుతూ వుంటుంది. అసాధారణ ప్రవర్తనలు పొడచూపినప్పుడు మార్కెట్టు విశ్లేషకుల మెదడుకు మరికొంత పని పెరుగుతుంది.

2004 జనవరిలో సెన్సెక్స్ విన్యాసం

జనవరి ఒకటి నుండి 23 తేదీ వరకు సెన్సెక్స్ ఏవిధంగా దినసరి విన్యాసాలు చేసిందో పట్టిక 2లో చూపడం జరిగింది. 2003 సంవత్సరంలో విదేశీ నిధుల ప్రవాహం $6.7బిలియన్ల కాగా కేవలం జనవరి 2004 మొదటి పక్షంలో $400 మిలియన్లు మేరకు చేరి అత్యంత ఆశాజనక స్థితిని చూపింది. జనవరి 20 వరకు 6000 పాయింట్లకు చేరుకున్న సెన్సెక్స్ తర్వాత ఆకస్మిక పతనం చెందింది. అయితే 23 జనవరిన తిరిగి పుంజుకుంది.

పట్టిక 2

జనవరి 2004 సెన్‌సెక్స్ పాయింట్లు

| తేది జనవరి | ప్రారంభ విలువ | గరిష్ట విలువ | కనిష్ట విలువ | ముగింపు విలువ |
|---|---|---|---|---|
| 1 | 5872.48 | 5936.41 | 5868.27 | 5915.47 |
| 2 | 5944.23 | 6034.38 | 5944.23 | 6026.29 |
| 5 | 6050.00 | 6078.11 | 5964.65 | 6039.00 |
| 6 | 6068.68 | 6121.20 | 5916.33 | 5943.64 |
| 7 | 5970.35 | 5985.30 | 5870.55 | 5957.02 |
| 8 | 5992.10 | 6118.62 | 5992.10 | 6108.54 |
| 9 | 6211.06 | 6249.60 | 6096.68 | 6119.59 |
| 12 | 6152.22 | 6152.22 | 6037.30 | 6067.76 |
| 13 | 6084.67 | 6147.74 | 6011.57 | 6132.97 |
| 14 | 6157.88 | 6215.02 | 6157.88 | 6194.11 |
| 15 | 6219.81 | 6248.81 | 6045.30 | 6063.91 |
| 16 | 6068.66 | 6072.03 | 5914.02 | 5946.19 |
| 19 | 5967.39 | 6076.97 | 5870.99 | 6064.10 |
| 20 | 6099.94 | 6130.09 | 5899.71 | 5922.11 |
| 21 | 5927.42 | 5962.36 | 5728.32 | 5758.19 |
| 22 | 5793 | 5847.67 | 5590.25 | 5593.74 |
| 23 | 5646.23 | 5832.74 | 5596.57 | 5816.64 |

అసలు ఎందుకు ఇలా జరిగిందంటే జనవరి 16, 2004న "ఫ్యూచర్స్ అండ్ ఆప్షన్స్" సెగ్‌మెంట్‌లో "టెక్నికల్ స్నాగ్ ఏర్పడింది. సాయంత్రం 3.30కే ముగించాల్సిన ట్రేడింగ్ అదనంగా 45నిమిషాలు, అంటే 4.15 పి.ఎమ్. దాకా పొడిగింపబడింది. ఈ కారణంగా అనేక బ్రోకర్లు తమ లావాదేవీలను మధ్యంతరంగా ఆపివేయాల్సి వచ్చింది. అయితే క్యాష్ కౌంటర్‌లో మాత్రం లావాదేవీలు యధాతథంగా జరిగాయి. సాంకేతికంగా ఏర్పడిన ట్రేడింగ్ పునరుద్ధరించినట్టుగా నేషనల్ స్టాక్ ఎక్స్ఛేంజి ప్రకటించింది కూడా. అయితే ఈ సందర్భంగా

*(తరువాయి 24వ పేజీలో)*

# బోగస్ ఓట్లు! బోగస్ పాలన!!

- ఇప్ప వీరారెడ్డి

ప్రజా ప్రభుత్వాలుగా చెప్పుకుంటున్న పాలనల్లో ప్రజాస్వామ్య స్వభావాన్ని వ్యక్తీకరించే అనేక అంశాల్లో అతి ప్రధానమైనది, మొట్టమొదటిది ఎన్నికల ప్రక్రియ. స్వతంత్ర్యానంతరం 56ఏళ్లుగా నిర్వహించబడుతున్న ప్రతీ ఎన్నికల్లోనూ ఇది తీవ్ర హాస్యాస్పదానికి గురవుతూనే ఉంది. రాజకీయ పార్టీలచే విచ్చలవిడిగా పంపిణీ చేయబడుతున్న డబ్బు, మద్యానికి తోడు కండబలం, అధికారబలం, భ్రమలకు గురిచేసే బోగస్ వాగ్దానాలు, అసత్య ప్రచారాల హోరుతో ఎన్నికల ప్రక్రియలో కీలకమైన 'ఓటు' హక్కు విలువలేనిదిగా మారింది. ఈ కారణాల చేత సమత, మమత, శాంతి, సౌభ్రాతృత్వం, సౌభాగ్యాలతో కూడిన సత్‌పాలనను అందించే పాలకుల ఎంపికలో పౌరుడు తన నిష్పాక్షిక అభిప్రాయాలను 'ఓటు' రూపంలో స్వేచ్ఛగా వెల్లడించగల అవకాశం రాజకీయ పార్టీలచే హైజాక్ చేయబడుతుంది. అత్యంత స్పష్టంగా, నిర్భయంగా పౌరులు ఓటు హక్కును వినియోగించుకునే అవకాశం మృగ్యమైపోవడంతో మొత్తం ఎన్నికల ప్రక్రియే ఒక బోగస్ కార్యక్రమం తంతుగా మారిపోయింది. అలాంటి బోగస్ ఎన్నికల్లో విజయం సాధించడం ద్వారా అధికారాన్ని చేజిక్కించుకున్న పార్టీ ప్రభుత్వం ద్వారా ప్రజలకందేది బోగస్ పాలనే అవుతుంది కాని సుపరిపాలన కాలేదు.

అక్రమ మార్గంలో ఆస్థుల సంపాదనకు రాజకీయాలు అత్యుత్తమ, అత్యున్నత, అతి సులభమైన మార్గంగా మారిన నేపథ్యంలో అధర్మ మార్గంలో అధికారం అందుకోవడానికి రాజకీయ పార్టీలు తొక్కని చెండాలపు మార్గాలంటూ ఏవీ మిగలవు. ఈ నేపథ్యమే ప్రజాస్వామ్య వ్యవస్థలో అతి పవిత్రంగా ఉండాల్సిన ఎన్నికల ప్రక్రియ అపవిత్రమైపోతుంది. మనరాష్ట్రంలో తాజాగా వెలుగుజూసిన కోటి బోగస్ ఓట్ల నికృష్ట నిర్వాకం ఆ అపవిత్రతకు ఒక పరాకాష్ట. పతనమైపోతున్న ప్రజాస్వామ్య విలువలకు ప్రమాణం.

బోగస్ ఓట్ల విషయంలో ఇటు అధికార దేశం-బి.జె.పి. వర్గాలు, అటు విపక్షాలు కూడా ఆందోళన పడుతున్నాయి. తొలగింపుకు వ్యతిరేకమైన ఆందోళనను అధికార వర్గాలు వ్యక్తం చేస్తుండగా, తొలగింపు చేయాల్సిందేనని విపక్షాలు ఆందోళనను కొనసాగించడం గమనించదగ్గది. బోగస్‌ఓట్ల చేర్పిక ఘనకార్యంలో అధికార కూటమి ప్రధాన భూమిక పోషించగా విపక్షాల కొసరు పాత్రను సైతం నిరాకరించలేం. ప్రక్షాళనా పరిశీలనల్లో అక్కడక్కడా కిందిస్థాయి విపక్షనేతలు కూడా ఈ వ్యవహారంలో బాధ్యులేనన్నట్లు పత్రికల్లో వార్తలొచ్చాయి. బోగస్ ఓట్ల తొలగింపుపై అధికార మిత్రద్వయం చిందులు తొక్కడాలు, బోగస్ ఓట్ల చేర్పికపై విపక్షనేతలు తీవ్రంగా ఖండించడాలను బట్టి ఒకరిది పైస్థాయి నుండి ఒక పథకం ప్రకారం నిర్వహించబడ్డ వ్యవహారంగా, మరొకరిది ఎక్కడికక్కడి స్థానిక నాయకత్వం తామెక్కడ వెనుకబడిపోతామోనన్న ఆదుర్దాతో స్వనిర్ణయంతో నిర్వహించిన కార్యక్రమంగా అర్థమైతుంది.

వివిధజిల్లాల్లో లక్షమొదలు 4లక్షలకు పైగా తొలగించబడిన బోగస్ ఓట్లతో తెలుగుదేశం బాజాపా మిత్రుల నోట్లో తడారిపోయింది. మొదట్లో బోగస్ ఓట్ల నమోదుపై విపక్షాల విమర్శల ఖండిస్తూ, కాదు, కాదంటూ నమ్మబలికిన వారే ఒక్కో జిల్లాలో లక్షలాది బోగస్ ఓట్లను ఏరేస్తుంటే 'తేలు కుట్టిన దొంగల్లా' చిరాకు పరాకు పడడంతో చేసిన దొంగతనం బయటపడిపోయింది. ఒక్కో నియోజకవర్గంలో కనీసం 10 మొదలు 15వేల వరకు బోగస్‌ఓట్లు తొలగించబడడంతో గత ఎన్నికల్లో ఐదు నుంచి పదివేల ఓట్ల మెజారిటీతో గెలుపొందిన, (ఒక్కోచోట 15వేల ఓట్ల మెజారిటీతో సైతం గెలుపొందిన) విజేతల గెలుపులోని బండారం బట్టబయలైంది. ఇంతకాలం తామనుభవించిన అధికార ధర్పానికి కారణమైన బోగస్ ఓట్ల తొలగింపుతో రేపటి ఎన్నికల్లో అధికారం చేజారిపోతుందన్న బెంగతో కలవరపడుతున్నట్లు వారి ప్రకటనల ద్వారా రుజువైతుంది. ఆపద్ధర్మ ముఖ్యమంత్రి, సత్‌పరిపాలనాధీశుడు చంద్రబాబు నాయుడు తొలగించబడిన బోగస్ ఓట్లను జిల్లా పాలనాధికారులను బెదిరించడం ద్వారా తిరిగి చేర్పించే బలవంతపు అనైతిక వత్తిడి ప్రయత్నాలకు శ్రీకారం చుట్టగా, తన మిత్రులు కమలాధరులు తొలగించిన బోగస్ ఓటర్లను తిరిగి నమోదు చేయించుకోవాలనే బోగస్ చైతన్య కార్యక్రమాన్ని చేపట్టడం విడ్డూరం. ఇది అధికారంపై వారికి గల యావను తెలియచేస్తుంది తప్ప మరొకటి కాదు.

ఎన్నికల కమీషన్ బోగస్ ఓట్లను తొలగించడాన్ని ఓటువేసే పౌరుల ప్రజాస్వామ్య హక్కుకు భంగం వాటిల్లినట్లుగా బిజెపి నేతలు వక్రీకరించడం పరమ అసహ్యకరం. పెంచిన విద్యుత్ బిల్లులకు వ్యతిరేకంగా బషీర్‌బాగ్ చౌరస్తాలో శాంతియుతంగా కొనసాగుతున్న ఉద్యమంపై పోలీసుల అమానుష కాల్పుల్లో ఆందోళనకారులు నేలకొరిగినప్పుడు కాని, వేతనాల పెంపుకోసం వేలాదిగా కదిలివచ్చిన అంగన్‌వాడి వనితలపై వాటర్‌కానన్‌లను ప్రయోగించి అశ్వికదళాలతో మానవత్వాన్ని మరిచి తొక్కించినప్పుడు గాని, ప్రభుత్వ అసమర్థత అనాలోచిత విధానాల కారణంగా సృష్టించబడిన కొరతకు తోడు సీజన్ దాటిపోతుందన్న ఆదుర్దాతో విత్తనాల కోసం క్యూ కట్టిన రైతులపై లాఠీ చార్జీతో పాటు సమస్యతో ఏమాత్రం సంబంధం లేని సాధారణ యువకుడు పోలీసు కాల్పులకు బలైపోయినప్పుడు కానీ గుర్తుకు రాని అప్రజాస్వామ్యం, బోగస్ ఓట్లను తొలగిస్తుంటే గుర్తుకు వచ్చిందంటే అధికారం పట్ల వారికున్న వ్యామోహానికి ఇంతకంటే నిదర్శనం అక్కరలేదు. అంతెందుకు, కూలినాలీతో పొట్ట పోసుకుంటూ పూటపూటకు అవస్థలు పడుతూ అన్నివిధాలా అర్హులైన అభాగ్యులు నెలకు 20కిలోలు మించని బియ్యం కోసం తెల్లరేషన్ కార్డులు కోరుతూ 60లక్షలకు పైగా దరఖాస్తులు చేసుకుంటే, అందులో సగానికి సగం బుట్టదాఖలు చేసిన ప్రభుత్వ అప్రజాస్వామిక వైఖరి పట్ల ప్రజాస్వామ్యం గుర్తుకురాలేదు. నిన్నటికి నిన్న ఆరోగ్యం సామాజిక బాధ్యత అంటూ, పేద మధ్యతరగతి ప్రజలకు ఉచిత ఆరోగ్య వైద్య సదుపాయాలను కల్పించే బాధ్యత ప్రభుత్వానిదేనంటూ, ఆరోగ్యం మార్కెట్లో కొనే, అమ్మే సరుకు కాదంటూ 46 రోజుల పాటు అవిశ్రాంతంగా పోరాటం చేసిన జూనియర్ డాక్టర్ల ఆందోళన పట్ల ప్రభుత్వం ప్రదర్శించిన నిర్లక్ష్యం నియంతృత్వం విషయంలో గుర్తుకు రాని అప్రజాస్వామ్యం, బోగస్ ఓట్ల తొలగింపు విషయంలో గుర్తుకు వస్తుందంటే అది వారి రాజకీయ స్వార్థ స్వభావానికి నిదర్శనం.

ఓటరులిస్టులో నమోదు విషయంలో పౌరులను చైతన్యం చేసే కార్యక్రమానికి స్వీకారం చుట్టిన కమలనాథుల కార్యదక్షతను చూస్తుంటే ముచ్చటేస్తుంది. ఓటేసే వయస్సు వచ్చిన తరువాత ఓటరులిస్టులో పేరు నమోదు చేయించుకోవాలనే స్పృహను మరెవరో కలిగించాలనే అధమ స్థితిలో పౌరులెవరూ ఉండరు. గత ఏ ఎన్నికల్లోనూ ఓటింగ్ సరళి 60 నుండి 65శాతాన్ని దాటలేదు. మొత్తం ఓటర్లలో 35శాతం మంది ఓటర్లకు పైగా ఓటు హక్కును వినియోగించుకోవడానికి ఇష్టపడడం లేదని ప్రతీ ఎన్నికల్లోనూ వెల్లడవుతున్న వాస్తవం. ఎన్నికల పట్ల, ఓటింగ్‌లో పాల్గొనడం పట్ల పౌరులు ప్రదర్శిస్తున్న విముఖతకు గల కారణమేమిటో నన్నది తెలుసుకోడానికి ఏనాడూ దృష్టిపెట్టని వీళ్లు, ఓటరు లిస్టులో పేరు నమోదు చేయించుకోవాలని చైతన్యపరచ చూడడం వింత గొలుపుతుంది. అదీకాక ప్రతీ ఎన్నికల్లోనూ విచ్చలవిడిగా పంపిణీ చేయబడుతున్న డబ్బు, మద్యం, సంస్కృతికి ప్రతిఘటించే దిశగా ఓటర్లలో చైతన్యం తీసుకొచ్చే కార్యక్రమాన్ని చేపడితే నిజంగా హర్షించదగ్గ విషయం. ఇంకా చెప్పాలంటే గత ఎన్నికల సందర్భంలో అరచేతిలో వైకుంఠాన్ని చూపే అద్భుత వాగ్దానాలెన్నో ఇచ్చి అధికారం చేజిక్కించుకుని ఈనాటి వరకూ వాటి ఊసే ఎత్తక, తిరిగి ఇప్పుడు ఎన్నికల సమయంలో అదే నాటకాన్ని ఆడబోతున్న పార్టీలను నిలదీయాలనే చైతన్యాన్ని ఇచ్చేందుకు కృషి చేసినట్లైతే అది మరీ అభినందించదగ్గ విషయం అవుతుంది. ఇందుకు భిన్నంగా కేవలం ఓటరు లిస్టులో పేరు నమోదు చేయించే విషయంలో చైతన్యాన్ని చేసే కార్యక్రమానికి ఉబలాటపడడం వెనుకగల అసలు రహస్యం అర్థం కాని విషయమేమి కాదు.

అధికారంలో ఉండగా స్వప్రయోజనాలే పరమావధిగా పెట్టుకొని, ప్రజల ప్రయోజనాలను పరిరక్షించడంలోనూ, వృద్ధిపరచడంలోనూ నిర్లక్ష్యం ప్రదర్శిస్తున్న కారణంగా అధికారపార్టీ ప్రజల అసహనానికి గురవుతూ ఓటర్ల విశ్వాసాన్ని కోల్పోతుంది. అంటిపెట్టుకున్న అధికారాన్ని కాపాడుకోడానికి దానికి ఎప్పటికప్పుడు గెలుపును నిర్ణయించగల మోతాదులో కొత్త ఓటర్లను సృష్టించాల్సిన అవసరం కొత్తగా ఏర్పడబోతుంది. రాబోయే ఎన్నికల్లో పరాజయం ప్రమాదం నుండి బయటపడేందుకు బోగస్ ఓటర్ల చేర్చిక పాచికను అధికార పార్టీ (పార్టీ ఏదైనా) ఒక తరుణోపాయంగా ఎంచుకొనే ప్రమాదం ఉంది. ఎప్పటికప్పుడు ఓటరు నివేదిక సవరణ కార్యక్రమాన్ని అత్యంత జాగరూకతతో పరిశీలించనట్లైతే ప్రజాస్వామ్యంలో ఎన్నికల ప్రక్రియ పట్ల ప్రజలు మరింత విశ్వాసాన్ని కోల్పోతారనడంలో సందేహం లేదు.

ఇంతకు అధికార పార్టీలు తొలగించిన బోగస్ ఓట్లను ఎలాగైనా తిరిగి చేర్పించే కార్యక్రమం పట్ల ఇంతగా శ్రద్ధ చూపెట్టడం వెనుక గల అసలు రహస్యం, బోగస్ ఓట్లు పోగా లెక్కతేలిన నిఖార్సైన ఓట్ల ద్వారా వారి గెలుపుకు గ్యారంటీ లేదనే బయమేకావచ్చు. రేపటి ఎన్నికల్లో ఎలాగైనా తమ గెలుపును ఖాయం చేసుకునే విధంగా ఒక పథకం ప్రకారం ఒక్కో నియోజక వర్గంలో తమవిగా భావించే వేలాది ఓట్లు బోగస్‌గా తేలిపోయి తొలగించబడడంలో విలవిలలాడిపోతున్నారు. అదీ అసలు విషయం.

○

# స్వదేశీ ముసుగులో 'భాజాపా' రూపం

- వి. శ్రీహరి

"త్రికరణశుద్ధిగా" అన్నమాట విన్నారా!

మనసులో ఆలోచన, నోటినుండి వచ్చే మాట, చేసే ప్రతిపని సక్రమంగా వుండడం అని దీని అర్థం. అంతేగాదు ఈ మూడు ఒకటిగానే వుండాలని. మనసులో అనుకునేది చెప్పక, చెప్పింది చెయ్యకపోతే- అలాంటి వాడి స్నేహానికి ఒక దణ్ణం పెట్టమంటారు పెద్దలు. అలా వదిలించుకోడానికి కొంత చేతి "చమురు" వదిలినా ఫరవాలేదంటారు. మనిషి విషయం అదైతే ఒక రాజకీయపార్టీ అలాంటిదైతే ఏమి చెయ్యాలి?

ఈనాడు కేంద్రంలో అధికారంలో వున్నది ఎన్.డి.ఎ. దానికి భారతీయ జనతా పార్టీ నాయకత్వం వహిస్తున్నది. ఆ పార్టీ పుట్టుక, దాని మాట, చేతలు అన్నిటా- మనం కోరేది, కాగడా వేసి వెతికినా, పుటం పెట్టి శుద్ధిచేసినా దొరకని - ఈ త్రికరణశుద్దే.

బిజెపి ఏమాత్రం తటపటాయింపులేకుండా త్రికరణశుద్ధిగా కోరేది అధికారం, రాజకీయ అధికారం. ఆ అధికారం కోసం ఏ దారి తొక్కేందుకు దానికి ఎలాంటి అభ్యంతరం లేదు. బిజెపి అనే పేర ఒక కొత్త రాజకీయ పార్టీగా ఏర్పడింది. 1980 ఏప్రిల్ 5న అయితే అదే దాని మొదలు కాదు. తుది వరకూ అదే పేరిట కొనసాగుతుందనీ చెప్పలేం. ఏ తుది లక్ష్యంతో ఒక రాజకీయ పార్టీ ఏర్పడుతుందో, ఆ పేరు పెట్టుకొని ప్రచారం సాగించుకోవడం సాధారణ సాంప్రదాయం.

దురదృష్టవశాత్తు తన లక్ష్యాన్ని బహిరంగంగా చెప్పుకునే అవకాశం బిజెపికి లేదు. బిజెపికి స్వంత వ్యక్తిత్వం లేదు. అది ఆర్ఎస్ఎస్ చెట్టువేసిన ఒక పిలక. ఆర్ఎస్ఎస్ లక్ష్యం ఈ దేశంలో మెజారిటీ మతస్థులైన హిందువుల రాజ్యం ఏర్పర్చడం. ఈ దేశంలో అనేక హిందూ రాజ్యాలు ఏర్పడ్డాయి. విదేశాల నుండి అనేకమంది వివిధ జాతులవారు వచ్చి ఈ దేశంలో స్థిరపడ్డారు. రాజ్యాలు ఏర్పర్చారు. ఏలారు. ఎక్కడ పుట్టి ఇక్కడ చేరినా అంతా హిందువులే అయినారు. ముస్లింలు మాత్రమే తమ మతాభిప్రాయాలను నిలబెట్టుకున్నారు. కాని ఇక్కడి గాలిలో భాగమైనారు. అప్పటికే ఈ దేశ జనజీవితంలో భాగమైన అనేక సాంప్రదాయాలను జీర్ణించుకున్నారు. తమ సాంప్రదాయాలను అనేక వాటిని ఆనాటికే ఇక్కడ వున్న ప్రజాజీవితంలో భాగం చేశారు. ఆ విధంగా ఆరాధనలో తప్ప జన నిత్యజీవితంలో ఈ తేడా ఎక్కడా కనిపించేది కాదు. ఆ సాంప్రదాయాన్నే ఇంగ్లీషు వారితో స్వాతంత్ర్యం కోసం సాగించిన పోరాటం పుణికి పుచ్చుకుంది. స్వతంత్ర భారతదేశం ఏర్పర్చుకున్న రాజ్యాంగంలో ప్రజల హక్కుల విషయంలో వివక్షతకు తావులేదని ప్రకటించింది.

కాని ఆర్ఎస్ఎస్ ఈ సాంప్రదాయాన్ని అంగీకరించదు. అంగీకరించకుండా వుండేందుకు కారణాలూ చెప్పదు. ప్రపంచంలో వివిధ ప్రాంతాల నుండి ఈ దేశానికి వచ్చిన వారు ఇక్కడ స్థిరపడ్డారు. అలా స్థిరపడిన వారెవరినీ తరిమికొట్టాలని ఈ దేశపు రాజులు భావించలేదు. తమ తమ రాజ్యాధికారం చలాయించే భూభాగాలను విస్తరించుకునేందుకు యుద్ధాలు జరిగాయి. అవి హిందూ రాజుల మధ్య జరిగాయి. మహమ్మదీయ రాజుల మధ్య జరిగాయి. హిందూ-మహమ్మదీయ రాజుల మధ్య గూడా జరిగాయి. రాజ్యవిస్తరణ తప్ప, మతప్రసక్తి వీటిలో ఎక్కడా లేదు.

మతరాజ్య భావానికి ఈ దేశంలో పునాది వేసినవాడు హెగ్డేవారే. వాటికి కండపుష్టి కలిగించింది సావర్కర్. ఆ సావర్కర్ గారే 1857-59 మధ్య ఇంగ్లీషువారికి వ్యతిరేకంగా సాగిన భారతీయుల పోరాటాన్ని "ప్రథమ స్వాతంత్ర్య పోరాటం" అనే పేర గ్రంథస్తం చేశాడు. అందులో పోరాడి ఢిల్లీ చేరిన విప్లవకారులు మూలపడి నిస్సహాయంగా వున్న ముస్లిం రాజునే భారత సామ్రాట్టుగా ప్రకటించారు. ఆ పోరాటం అయోధ్య భూభాగం నుండి ప్రారంభమైన మహాసంగ్రామం బ్రిటిష్ పాలకులు ఆ పోరాటాన్ని అత్యంత క్రూరంగా అణచివేశారు. రోజువారీగా ఆ పోరాట వార్తలను గమనించిన కారల్‌మార్క్స్ వారి దమనకాండను కండ్లను కట్టినట్లు రాశారు. ఆ తరువాత అనేక పుస్తకాలు వచ్చాయి. హిందువులు- మహమ్మదీయులు కలిసి పోరాడారనే కసిని తెల్లవారు చేపట్టిన అకృత్యాలలో చూపారు. అయోధ్య నవాబును, రాజారామచంద్రను ఒకే చెట్టుకొమ్మకు వేలాడదీసి వురివేశారు.

అదొక మహాపోరాటం. దానికి ప్రభంజన రూపం యిచ్చింది హిందూ-ముస్లిం సమైక్యత. ఆ పోరాటాన్ని ఆరాధించేవారు దానికి ఊతంగా నిలిచిన భారత సమైక్యతను ఆరాధించి తీరాలి. ఆ పోరాటాన్ని, దాని వెనుకవున్న భారతదేశ సమైక్యతను అసహ్యించుకున్నది బ్రిటిష్ పాలకులు. ఆ తరువాత కాలంలో మతప్రాతిపదికన ప్రజలను విడగొట్టాలని అన్ని విధాలా ప్రయత్నించారు బ్రిటిష్‌వారు. ఆ విధంగా ఈ దేశంపై తమ పెత్తనం కొనసాగించుకోవచ్చని ఆశించారు. వారి ఆశ ఫలించలేదు. కాని 1947 ఆగస్టు స్వాతంత్ర్యం ఒక దేశానికిగాక, విభజనకు గురైన రెండు దేశాలకు వచ్చింది.

రెండవ ప్రపంచ యుద్ధంలో హిట్లర్ ఓడాడు. ఫాసిజం ఓడింది. అంతేగాదు సామ్రాజ్యవాదం అన్నివిధాల బలహీనపడింది. ఆ సమయంలోనే వివిధ వలస దేశాల ప్రజలు వలసాధిపత్యానికి వ్యతిరేకంగా పోరాడసాగారు. ఆ పోరాటాలు నాయకులు గీచిన గీటుదాటి పోసాగాయి.

పెరుగుతున్న ప్రజాపోరాటాలను సహించలేని జాతీయోద్యమ నాయకత్వం దేశాన్ని చీల్చి అయినా సరే అధికారం చేజిక్కించుకోవాలనే తపన. అదే దేశాన్ని చీల్చింది. ఆ చిచ్చు యాభై సంవత్సరాలుగా రావణాసురుని కాష్టంలా రగులుతూనే వుంది. లక్షల కోట్ల రూపాయలు "రక్షణ" పేర ప్రజల శ్రమ ఆ మంటలకు నెయ్యిలా సంతర్పణ అవుతున్నాయి. ప్రజలు పేదరికంతో కునారిల్లిపోతున్నారు. పాలకులు కమిషన్లు దండుకుంటున్నారు.

ఈ చీలికకు మతం ప్రాతిపదిక. అది ఈ దేశాన్ని సమైక్యంగా వుంచలేదు. ప్రపంచంలో ఎక్కడో కాదు మతప్రాతిపదికపై ఏర్పడిన పాకిస్తాన్ ఈనాడు 1947 ఆగస్టులో ఏర్పడిన రూపంలోనే వుందా? ఇవి మన అనుభవాలు. ఎక్కడి చరిత్రగాదు. మన దేశచరిత్ర. మతవిద్వేషం రెచ్చగొట్టి తమ పాలన కొనసాగించాలనుకున్నది, ఆ విషసర్పానికి పాలుపోసి పెంచింది సామ్రాజ్యవాదులు. మతవివక్షతలేని రాజ్యం ఏర్పడడం భారతీయ సంస్కృతీ సంప్రదాయాలకు ప్రతిబింబం. అదే మన రాజ్యాంగం. తిరిగి ఈరోజు మతం ప్రాతిపదికపై రాజ్యాన్ని కొత్తగా మలచాలనే వారు సామ్రాజ్యవాద మానసపుత్రులా? భారతీయ సంస్కృతీ పరిరక్షకులా? హిందూ సంస్కృతే భారతీయ సంస్కృతిగా మభ్యపెట్టి సామ్రాజ్యవాదులు నాటిన చెట్టుకు నీరు పోస్తున్నారు బిజెపి నేతలు. ఈ దేశాన్ని స్వతంత్ర్య దేశంగానే చూడాలని, స్వేచ్ఛాయుత జాతి తలెత్తుకు బ్రతకాలని కోరేవారు, సామ్రాజ్యవాద భావజాలానికి బానిసైన వారికి అధికారం యిస్తామని కలలోనైనా అనుకోగలరా?

* * *

ఈ దేశం ఎవరినీ ప్రతిఘటించలేదా?

ప్రతిఘటించింది. ఈ దేశాన్ని జయించి తిరిగి స్వదేశం వెళ్లిపోవాలని తలచిన అలెగ్జాండర్‌ను ఎదిరించింది. బ్రిటిష్ పాలకులనూ ఎదిరించింది. ఈ దేశానికి వచ్చి స్థిరపడిన ఇతర జాతులకు, ఈ దేశాన్ని వలసదేశంగా మార్చిన తెల్లవారికి తేడాను కారల్‌మార్క్స్ ఎంతో విశ్లేషణాయుతంగా వివరించారు.

ఈ దేశంపై దండయాత్రచేసి, అందిన సొమ్ము కాజేసి వెళ్లిపోయినవారు కొందరు. వీరు దోపిడీదారులు. అందుకు మహమ్మద్ ఘోరీని ఉదాహరణగా చెప్పవచ్చు. ఈ దేశానికి వచ్చి యిక్కడే స్థిరపడి పోయినవారు మరికొందరు. మహమ్మదీయులు ఇందుకు ఉదాహరణ. వీరు జనజీవితంలో భాగస్వాములు. ఈ రెంటికీ చెందనివారు తెల్లవారు. వారు పాలకులైనారు. కాని జనజీవితంలో భాగస్వాములు కాలేదు. వారు పాలన సాగించినంతకాలం, ప్రతిరోజు, ప్రతిక్షణం ఈ జాతిరక్తాన్ని బొట్టుబొట్టుగా జలగలా పీల్చారు. ఈ దేశాన్ని అంతా ఆక్రమించుకునేందుకు, ప్రజాప్రతిఘటన మధ్య, వంద సంవత్సరాలు పట్టింది. వారిని వదిలించుకునేందుకు ఈ జాతికి 90 సంవత్సరాల పోరాటం అవసరమైంది. ఆ పోరాట యజ్ఞంలోనే విడివిడిగా వుండిన, చెల్లాచెదురై వుండిన పల్లెలు, పట్నాలు, వివిధ భాషాజాతులు, రాజ్యాల ప్రజలు ఒకటైనారు. భారతజాతి, ఒకే రాజకీయ జాతిగా పరపాలకులను ప్రతిఘటించింది.

ఆ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటమే దీనికంతా మూలం. సామ్రాజ్యవాదులను ప్రతిఘటించి, దేశాన్ని స్వంతం చేసుకుంది. ప్రజల జీవితాన్ని సౌభాగ్యవంతం చేసే ప్రయత్నం ప్రారంభించింది. సామ్రాజ్యవాదం దివాలా తీయించిన వ్యవసాయరంగాన్ని మెరుగుపరచుకుంది. నిజమైన అర్థంలో కాకున్నా, కరువుకోరల పదను తగ్గించింది. పంటల దిగుబడినే కాదు, వైవిధ్యాన్ని పెంచుకుంది. పారిశ్రామిక పునాదిని, ముఖ్యంగా కాపిటల్ గూడ్స్ పరిశ్రమను పెంపొందించుకుంది. పారిశ్రామిక రంగం పెరిగింది. పరిశోధనా రంగం శాస్త్ర, సాంకేతిక నిపుణులను తగినంతమందిని తయారుచేసుకుంది. దీని అర్థం ప్రజలంతా సౌభాగ్యవంతంగా వున్నారని కాదు. ఏర్పర్చుకున్న ఈ పునాదులతో దేశస్వాతంత్ర్యపు పునాదులు గట్టిపడ్డాయని కాదు. ఈనాటి ప్రపంచం సాధించిన వైజ్ఞానిక, సాంకేతిక పురోగతిని జీర్ణించుకోగల సమర్థత పెంచుకుందనీ కాదు. ఈ దేశాన్ని పాలించిన వివిధ పాలకులు నిర్వహించిన పాలనా వ్యవస్థ తీరు అది. దానిని మరొకసారి వివరంగా చర్చించుకుతీరాలి.

కాని ఈ వ్యాసం అందుకు వుద్దేశించింది కాదు. పరిమితంగానైనా, అవధుల మధ్యనైనా ఈ ప్రగతి సాధించడంలో వున్న ఒక సామాన్య అంశాన్ని పాఠకుల దృష్టికితెచ్చి, ఆ సామాన్య లక్షణానికి అవరోధం ఏర్పడుతున్నదని చెప్పేందుకే.

ఈ దేశం సాధించిన విజయాలు 1947 ఆగస్టు నుండీ ఒకే వేగంతో ప్రవహించిన ప్రవాహం కాదు. ఈ కాలమంతా ఎగుడుదిగుళ్లే. స్వాతంత్ర్యం రాగానే ఈ దేశాన్ని పారిశ్రామికవంతం చేసేందుకు పాత పెత్తందార్లుగా వుండిన సామ్రాజ్యవాదులు సహాయపడతారని స్వతంత్ర భారత ప్రభువులు ఆశించారు. వివిధ సామ్రాజ్యవాద దేశాల చుట్టూ ప్రదక్షిణలు చేశారు. విదేశీ విధానాలతో సహా అన్నివిధాలా వారి అడుగులకు మడుగులు వత్తారు. తాము చేస్తున్న కమ్యూనిస్టు వ్యతిరేక మహాయజ్ఞంలో భారత ప్రజలను కూడా సమిధలను చేయమని సామ్రాజ్యవాదులు డిమాండ్ చేశారు. సామ్రాజ్యవాద వ్యతిరేక భావాలతో పునీతమైన భారత ప్రజల మనోభావాలు అందుకు అడ్డుగా నిలిచింది. ఆనాడూ పాలకులలో సామ్రాజ్యవాద మానసపుత్రులకు కరువులేదు. కాని ప్రజాగ్రహం వారి సాహసాన్ని, ఆశలను అదుపులో పెట్టింది. ఈ దేశం పారిశ్రామికవంతం కావలసిన అవసరం లేదని సామ్రాజ్యవాదుల సలహా. వారి కోరిక. ఈ దేశం వ్యవసాయరంగాన్ని పెంపొందించుకొని, పారిశ్రామిక దేశాల పెరటిదొడ్డిగా కలకాలం బ్రతకాలని వారి సలహా. ప్రగాఢ వాంఛ. మన ప్రథమ ప్రణాళిక ఇందుకు ప్రతిబింబం.

సైనిక కూటములలో చేరక, పి.ఎల్.480 పుచ్చుగోధుమలు గూడ కొరవడడం, పాకిస్తాన్ సైనిక కూటములలో భాగస్వామి కావడం, భారత పాలకుల కండ్లు తెరిపించాయి. అప్పటినుండీ సామ్రాజ్యవాదుల వెలుపలగల అభివృద్ధి అవకాశాలను వెదకసాగారు. జాతి విజయాలను సాధించింది. ఇందిరాగాంధి హయాంలో మరొక ప్రయత్నం జరిగింది. ఐఎంఎఫ్ అప్పు ముప్పు తెచ్చింది. త్వరలోనే కండ్లు తెరిచిన ఇందిర "బి ఇండియన్, బై ఇండియన్" అంటూ నినదించి స్విస్ వాచ్ వదిలి హెచ్.యం.టి. వాచ్ పెట్టుకుంది బహిరంగ సభలో. ఆ సమయంలోనే ఈ దేశం మరికొంత ముందుకు సాగింది. రెండవ విడత ఐఎంఎఫ్ అప్పును దేశం వదులుకున్నది.

జనసంఘ్ భాగస్వామిగా వున్న జనతా పార్టీ హయాంలో సడలింపు జరిగింది. ప్రపంచం వెలేసిన ఇజ్రాయిల్‌ను సందర్శించిన మొదటి విదేశాంతమంత్రి శ్రీ వాజ్‌పేయి. బ్రిటిష్‌రాణి పాదాలను భారత రాయబారి "కాలిచే" విదేశాంత విధాన నేత ఆయనే. వారే జనతాపార్టీ పతాకాన్ని తెచ్చిపెట్టారు.

ఇందిరకు తిరిగి పట్టం కట్టారు. ఈ సడలింపు రాజీవ్‌గాంధి హయాంలో మరింత పెరిగింది. ఇరవై ఒకటో శతాబ్దపు పయనం విదేశీ ప్రైవేట్ అప్పులతో సాగి, 1991నాటికి సామ్రాజ్యవాద సంస్థల ముంగిట జోలెపట్టే స్థితికి తెచ్చింది. ఆ విధానాలను ఓడించేందుకే "స్వదేశీ" "సుపరిపాలన" నినాదాలను నమ్మి ప్రజలు భారతీయ జనతాపార్టీని అధికారం దాపులకు తెచ్చారు. అధికారాన్ని కట్టబెట్టారు.

కాని "స్వదేశీ" అంటే మన వ్యవసాయాన్ని, పరిశ్రమలను విధ్వంసం చేయడం అని భాజపా అర్థమని వారి పాలన రుజువు చేసింది. ఇది ఎంతో కాలం నుండి సామ్రాజ్యవాదుల కలలకు సాకారమే. భారత ప్రజల తీర్పును, సామ్రాజ్యవాదానికి కుదువ పెట్టింది ఎన్‌డిఎకు నాయకత్వం వహిస్తున్న భారతీయ జనతాపార్టీ. జైలు శిక్ష నుండి బయటపడేందుకు దేశమంతా నిరాకరించిన మాంటెగూ సంస్కరణలను అత్యంత విధేయతతో అమలు జరుపుతానని హామీ యిచ్చిన సావర్కర్ సంస్కారం బిజెపిది.

క్విట్ ఇండియా పోరాటంలో క్షమాపణ చెప్పిన ప్రధాని వాజ్‌పేయి. వీరంతా ఏనాడూ సామ్రాజ్యవాద వ్యతిరేకులు కారు. దానికి తోడు సెప్టెంబర్ 11తో ముస్లిం వ్యతిరేకతను రెచ్చగొట్టే బుష్‌లో ముస్లిం వ్యతిరేక బిజెపికి ఆత్మీయత పెరిగి, వారి విషకౌగిలిలో ఇమిడి, దేశాన్ని ముక్కముక్కగా అమ్మేస్తున్నారు.

జాతి పురోగతికి తోడ్పడింది. సమైక్య సాంప్రదాయం, భిన్న సంస్కృత సమ్మేళనం సామ్రాజ్యవాద వ్యతిరేకత భాజపా, ఈ రెండు చక్రాలను ధ్వంసం చేస్తోంది. భారత రథం కుప్పకూలిపోతుంది. దేశభక్తులారా! తస్మాత్ జాగ్రత్త!! స్వదేశీ అంటే భారతదేశం అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో మరొక రాష్ట్రం కావడమేనా? ఆలోచించండి. ○

*(6వ పేజీ తరువాయి)*

## అణచివేతకు ప్రతిస్పందనే 'అలిపిరి'

విచారణ సాగిస్తున్న ప్రకాష్‌సింగ్ కమిషన్ దృష్టికి ఈ అంశాన్ని తేవడం జరిగింది.

### ప్రపంచబ్యాంకు పరిమితి

ఇలాంటి పరిస్థితుల్లో, అభివృద్ధి చెందుతున్న దేశాలకు అప్పులు ఇచ్చేముందు ప్రపంచబ్యాంకు వంటి అంతర్జాతీయ ఆర్థిక సంస్థలు కొన్ని వాస్తవాలను పరిగణనలోకి తీసుకోవాలని వత్తిడి చేయాల్సిన అవసరం ఏర్పడింది. ఎలాంటి అసమ్మతికి, విమర్శకి అవకాశం ఇవ్వని నిరంకుశ చట్టవ్యవస్థ వెనుకబాటుతనానికి చిహ్నం. అలాంటి పరిపాలనా వ్యవస్థ మంజూరైన అప్పుల్ని, నిధుల్ని అసమంజసంగా వినియోగించారన్న విమర్శను అనుమతించదు. నియంతృత్వ, పెత్తందారీ తరహా పరిపాలనకు వీలు కల్పించే అవకాశం ఏ అంతర్జాతీయ ఆర్థిక సంస్థకూ లేదు.

రుణాలు కోరే దేశాలను- వాటి రాజ్యాంగాలను, చట్టస్వరూపాన్ని మార్చుకోవలసిందిగా, తమ రుణాల మంజూరు ద్వారా ఆంక్షలు విధించే సంస్థగా ప్రపంచబ్యాంకు మారింది. దానిపాలనలో అది ఆయా దేశాలకు వాటి ప్రజలకు జవాబుదారీతనం వహించడంలేదు. ఆ బ్యాంకు కన్సల్టెంట్లు ఒక దేశ వాణిజ్య విధానాలను, ఆర్థిక విధానాలను, పౌరసేవల అవసరాలను, కార్మికచట్టాలను, ఆరోగ్య సంరక్షణ ఏర్పాట్లను, పర్యావరణ నియంత్రణలను, పునరావాస అవసరాలను, సేకరణ నియమాలను, బడ్జెట్ విధానాలనూ తరచూ తిరిగిరాస్తుంటారు. అభివృద్ధి ప్రక్రియ అనేది సకల జీవనరంగాలలోనూ సామర్థ్యాలను పెంపొందించేసేదిగా ఉండాలి. ప్రజల జీవన ప్రమాణాలను పెంపొందింపజేయాలి. మంజూరు చేసే రుణాలు ప్రజాప్రయోజనాలకు వినియోగపడేలా ఉండాలి తప్ప, నాయకులు వారికి మద్దతునిచ్చే సంపన్న వర్గాలు మరింత బలవడానికి ఉపయోగపడరాదు. తీసుకున్న అప్పుల వివరాలు, వాటిని వినియోగించిన తీరు గురించి ముఖ్యమంత్రి ప్రజలకు బహిరంగపరచడమేకాక- కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ ద్వారా ధృవీకరింపజేయాలి. కాగ్ నివేదికలను విస్తృతంగా ప్రచారం చేయాలి. ప్రపంచబ్యాంకు ప్రజారాజకీయ పరిధిలోనే వ్యవహరించాలి. అంతేతప్ప దానికి తను కోరుకున్న విధంగా ప్రవర్తించే స్వతంత్ర్య హక్కు లేదు.

***(ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడిపై జరిగిన అలిపిరి దాడికి కారకులైన నేపథ్యాల్ని విశ్లేషిస్తూ కె.జి. కన్నాభిరాన్, (పియుసిఎల్ జాతీయ అధ్యక్షులు, కె. బాలగోపాల్ (మానవ హక్కుల వేదిక)లు, ప్రపంచబ్యాంకుకు పంపిన విజ్ఞాపన పత్రానికి ప్రతిరూపమే ఈ వ్యాసం)-*** ○

# హిచిన్స్ పరిశోధనల్లో మదర్ థెరిస్సా

- ఎన్. ఇన్నయ్య

అంతర్జాతీయ రిపోర్టర్‌గా ప్రముఖ పత్రికలలో సంపాదకుడుగా పేరొందిన క్రిస్టాఫర్ హిచిన్స్ జర్నలిజంలో కొత్తదారులు తొక్కారు. ధైర్యంగా వాస్తవాలు చెప్పడంలో, మతాలను, పవిత్రతను ఆయన పక్కనపెట్టలేదు.

1949లో ఇంగ్లండ్‌లో పుట్టిన హిచిన్స్, ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో 1970 నాటికి ఫిలాసఫి, రాజకీయం, ఆర్థికం అభ్యసించారు. పత్రికారంగంలో ప్రవేశించి అటు అమెరికాలో యిటు యూరోప్‌లో విశిష్ట పరిశోధనాత్మక జర్నలిస్ట్‌గా నిలదొక్కుకున్నారు.

ఇరాక్‌పై అమెరికా సైన్యాన్ని పంపినప్పుడు, హిచిన్స్ పర్యటించి ప్రత్యక్షంగా వాస్తవాలు చూచి, రిపోర్టు చేశారు. బుష్ చేసిన దోషాలను విమర్శించారు. ఇరాక్‌లో షియాలకు, ఖుర్దులకు జరిగిన ఉపయోగాలను పేర్కొన్నారు. సమస్యను రెండు కోణాల నుండి పరిశీలించడం ఆయన విశిష్టత.

న్యూస్టేట్స్‌మన్‌లో స్టాఫ్ రైటర్‌గా ఆరంభించిన హిచిన్స్ ఈవెనింగ్ స్టాండర్డ్ హార్బర్ పత్రికలో ఎడిటర్‌గా, డైలీ ఎక్స్‌ప్రెస్ విదేశీ విలేఖరిగా పనిచేశారు. కాలిఫోర్నియా, పిట్స్‌బర్గ్ విశ్వవిద్యాలయాలలో విజిటింగ్ ప్రొఫెసర్‌గానూ హిచిన్స్ పనిచేస్తున్నారు.

వ్యాసాలు, పుస్తకాలు ప్రచురించిన హిచిన్స్ గడాఫి నుండి సద్దాం వరకు రిపోర్టింగ్‌లో అరమరికలు లేకుండా సత్యాన్వేషణ సాగించారు. అమెరికా విధానాలను దుయ్యబట్టాడు.

మత పవిత్రత పేరిట జరుగుతున్న ముసుగు వ్యవహారాలను పరిశోధించడంలో మదర్‌థెరీసా ఉదంతాలను 20ఏళ్ళుగా వెంటాడి వెలికితీసిన విషయాలు ఆశ్చర్యం కల్పిస్తాయి.

ప్రస్తుతం ది నేషన్, వానిటీ ఫెయిర్ పత్రికలకు రాస్తున్నారు. లోగడ టైమ్స్ లిటరరీ సప్లిమెంట్, న్యూయార్క్ టైమ్స్, వాల్‌స్ట్రీట్ జర్నల్‌లో రాసారు.

## క్రిస్టోఫర్ హిచిన్స్ ఆదర్శ మార్గం

సుప్రసిద్ధ పత్రికా రచయిత, విమర్శకులు అయిన క్రిస్టోఫర్ హిచిన్స్ నేడు అమెరికా, యూరప్‌లలో తన విమర్శ బాణాల ద్వారా యువ జర్నలిస్టులకు ప్రోత్సాహకారి అవుతున్నారు. ఆయన వానిటీ ఫైర్, ది నేషన్ మొదలైన పత్రికలలో అనేక ఆశ్చర్యకరమైన విషయాలను బయటపెట్టారు. ఒక రకంగా ఆయన జర్నలిజం ఎదురీత వంటిది.

ఇందుకు ఉదాహరణగా ఆయన వివిధ పత్రికలలో వ్రాసిన, టివిలలో ప్రసారం చేసిన మదర్‌థెరిస్సా ఉదంతాలు పేర్కొనవచ్చు. మిషనరీ పొజిషన్ అనే రచన ద్వారా మదర్‌థెరిస్సా వసూలుచేసిన ధనాన్ని గురించి, నియంతలతో సన్నిహితత్వాన్ని, అనాథ గృహాలలో చికిత్సలో నోచుకోక బాధలకు గురైన పిల్లలను గురించి ఎన్నో ఆశ్చర్యకరమైన వాస్తవాలను వెల్లడించారు. ఇటీవల ఆమె చనిపోగానే పోప్‌పాల్ ఆమెను సెయింట్ చేయాలని ఆతృత చూపిన విధానాన్ని కూడా ఆయన దుయ్యబట్టారు. ఆమె పేరిట ప్రచారంలోకి వచ్చిన మహత్తులు బూటకాలని, కల్పించినవని చూపారు. ఇదంతా కేవలం అమెరికాలోనో, ఇంగ్లండ్‌లోనో కూర్చొని వ్రాయలేదు. ఆయన స్వయంగా కలకత్తా వెళ్ళి మదర్‌థెరిస్సా ఛారిటీ గృహాలను సందర్శించి జరుగుతున్న వాస్తవాలను తెలుసుకున్నారు. మదర్‌థెరిస్సాను కూడా ఇంటర్వ్యూలు చేశారు. జన బాహుళ్యంలో ఆమె గురించి వున్న ప్రచారం, సేవా దృక్పథం వాస్తవాలకు విరుద్ధంగా వున్నదని హిచిన్స్ సోదాహరణంగా చూపారు.

## పేరుమార్చి, వూరుమార్చి!

మదర్‌థెరిస్సా అసలు పేరు ఆగ్నిస్ గోక్సాబొజాహు.

ఆమె పుట్టింది కేథలిక్ కుటుంబంలో (1910). నేటి మసడోనియాలోని ఉస్కుబ్ నగరం జన్మస్థలం. ఆమె అట్టే చదువుకోకుండానే, ఐర్లండ్ క్రైస్తవ మతసంస్థ సిస్టర్స్ లారిలో చేరింది. 1929లో కలకత్తా చేరి సెయింట్ మేరీస్ హైస్కూలులో పనిచేసింది. డార్జిలింగ్‌లో మత బోధకుగురైన గోక్సాబొజాహు అక్కడే పేరు మార్చుకున్నది. 1937 నుండీ మదర్‌థెరిస్సాగా చలామణి అయింది.

పాట్నాలో మెడికల్ మిషన్ సిస్టర్స్ వద్ద శిక్షణ పొందింది. 1948 నుండి ఆమెకు సొంతంగా మిషన్ నడపడానికి పోప్ అనుమతించాడు. 1950 నుండీ మిషనరీస్ ఆఫ్ ఛారిటీ కలకత్తాలో ప్రారంభించింది. అప్పటినుండీ ఆమెకు ధనం కుప్పలుతెప్పలుగా వచ్చి పడింది. దానికి లెక్కలు, ఆడిట్ ఏమిలేదు. చట్టప్రకారం ప్రభుత్వం అందరినీ ఆరాతీసి వివరాలు అడిగినట్లు, మదర్‌థెరిస్సాను అడగలేదు.

1965 నుండీ విదేశాలలో తన మత సంస్థలను విస్తరించిన థెరిస్సా, తొలుత వెనిజులాతో మొదలెట్టి, టాంజానియా, రోమ్‌లలో పీఠాలు పెట్టింది.

మాల్కొలం మగ్‌రిజ్ రాసిన ప్రచార సాహిత్యంతో థెరిస్సాకు

పాశ్చాత్య లోకంలో కావలసినంత ప్రచారం లభించింది. ఒక వైపు నుండి పోప్, మరోపక్క కేథలిక్ నియంతలు ఆమెకు అండగా నిలిచారు. అంతేగాక అటు ప్రభుత్వాలు యిటు సంస్థలు ఆమెకు బహుమతులు సత్కారాలు, బిరుదులు యిచ్చారు. గౌరవ డిగ్రీలు సరేసరి. 1979లో నోబెల్ శాంతి బహుమానమే యిచ్చారు. శాంతి కోసం ఏం చేసిందని హిచిన్స్ ప్రశ్నించారు.

**మహిమల గారడి:** పశ్చిమ బెంగాల్‌లో మోనికా బస్రా అనే కొండజాతి స్త్రీకి కేన్సర్ నయంగావడానికి మదర్‌థెరిస్సా చిహ్నం గుండెపై అట్టిపెట్టడమే కారణం అని చెప్పారు. తీరా విచారిస్తే మోనికాకు కేన్సర్‌లేదనీ, కడుపులో గడ్డ వుండేదని, ఆస్పత్రిలో డాక్టర్లు చికిత్సచేసి నయం చేశారని బయటపడింది. మోనికా భర్త మొదట నిజం చెప్పాడు. ఆమె బాలూర్‌గట్ ఆస్పత్రిలో చికిత్స చేయించుకున్నది. అక్కడి డాక్టర్లపై పరోక్షంగా మిషనరీలు ఒత్తిడి తెచ్చి, అద్భుతాల వలన నయం అయిందని చెప్పించారు. మోనికా కుటుంబానికి పొలం యిచ్చి, ఆమె పిల్లలకు చదువు చెప్పించడంతో మిషనరీలు ఎలా చెప్పమంటే, అలా చిలకపలుకులు పలికారు. ఈ విషయమై హేతువాదులు ప్రఫుల్లకుమార్ నాయక్ ప్రగతి సంస్థ పక్షాన పోప్‌పైనా, నిర్మల (థెరిస్సా వారసురాలు) పైనా పోలీస్ ఫిర్యాదు యిచ్చారు. 2003 అక్టోబరు 19న పోప్ తన అధికారంతో థెరిస్సాను సెయింట్ చేసే ప్రక్రియ చేశాడు.

**మోసాల డబ్బు:** అమెరికాలో పెద్ద మోసకారుడు చార్లస్ కీటింగ్ పేదల్ని దోచి, మోసగించి 252 మిలియన్ డాలర్లు కాజేశాడు. పొదుపు అనీ, రుణాలనీ అతడు చేసిన ఘోరాలు బయటపడగా జైలుపాలయ్యాడు. అయితే అతడు తన విమానాన్ని థెరిస్సా పర్యటనలకు యిచ్చాడు. అంతేగాక ఆమెకు తన మోసపు ధనంలో 1.25మిలియన్ డాలర్లు దానమిచ్చాడు. అంతటితో ఆమె వెనకా ముందూ చూడకుండా, ఔచిత్యాన్ని విస్మరించి, విచారణ జరుపుతున్న జడ్జి ఇటోకూ విజ్ఞప్తి చేస్తూ కోటింగ్‌ను శిక్షించవద్దన్నది. పేదల స్నేహితుడన్నది. ఇది గమనించి జిల్లా అటార్నీ పాల్‌టర్లే అనే వ్యక్తి ఆమెకు విజ్ఞప్తి చేస్తూ, కోటింగ్ ఇచ్చిన మోసపుధనాన్ని తిరగి యిస్తే అతడి మోసాలపాలన సర్వం కోల్పోయిన కొందరి కుటుంబాలైనా నిలబడతాయన్నాడు. మదర్‌థెరిస్సా మౌనం వహించింది.

**భోపాల్ చావులు:** 1984 డిసెంబర్ 2 అర్ధరాత్రి భోపాల్‌లో మల్టీనేషనల్ కంపెనీ యూనియన్ కార్బైడ్స్ నుండి విషవాయువులు బయటకు రాగా, వేల మంది తెల్లారేసరికి చనిపోయారు. అది జరిగిన తరువాత కలకత్తా నుండి థెరిస్సా విమానంలో వచ్చి యాజమాన్యాన్ని క్షమించమని విజ్ఞప్తి చేసింది. ఆమె జీవకారుణ్యం అలాంటిది!

**పిల్లల చికిత్స తీరు:** లాన్సట్ మెడికల్ పత్రిక సంపాదకుడు డా॥ రాబిన్ ఫాక్స్ కలకత్తాలోని మదర్‌థెరిస్సా పిల్లల గృహాలు చూచి అక్కడి చికిత్స, వైద్య విధానాలను (1994) విమర్శించారు. జబ్బుల విషయంలో తీవ్రత గమనించక పోవడాన్ని గుర్తించారు. పరిశుభ్రతను తప్పు పట్టారు. చన్నీళ్ళలో సిరంజిలు కడగడం ఘోరం. పిల్లలకు తగిన బాధా నివారణ కలగించకపోవడం చూశారు.

రోగుల్ని దారుణంగా చూచేతీరును అక్కడ పనిచేసిన మేరీలాడెన్ గార్డియన్ పత్రికలో (1992 మే 3)న రాశారు. దేవుడిపై భారం వేశామనడం, ప్రార్థనలతో సరిపుచ్చడం, రోగి చనిపోతే యిలాంటి భక్తి సాకులు చెప్పడం తరుచూ జరిగినట్లు ఆమె రాశారు. కుప్పలు తెప్పలుగా డబ్బు వచ్చి పడుతున్నా రోగుల్ని, అనాథ పిల్లల్ని సరిగా చూడకపోవడం ఆనవాయితీ అయింది.

**నియంతల కోపు:** 1981లో హైతి నియంతను సందర్శించి ఆయన పొగడ్తలు, సన్మానాలు అందుకున్నది. జాన్‌క్లాడ్ దువలియర్ నరరూప రాక్షసుడుగా పేరొందిన పాలకుడు. అలాంటి వ్యక్తిని తెగ పొగడింది. అతడిచ్చిన సత్కారాలు సొమ్ము స్వీకరించింది. ఆమెకు డబ్బిచ్చినవారంతా ఆమెకు మంచివారే!

1987లో తన దేశమైన అల్బేనియా వెళ్ళి అక్కడి నియంత పాలకుడు ఎన్వర్ హాక్సా సమాధిపై గుచ్చం వుంచి శ్రద్ధాంజలి ఘటించింది. అతను కమ్యూనిస్టు నిరంకుశుడని తెలిసికూడా థెరిస్సా అలా ఎందుకు చేసిందోనని విస్తుపోయారు.

**దయానా విడాకులు ఓ.కె.:** ప్రిన్స్ దయానా విషయంలో మాత్రం మదర్‌థెరిస్సా మాటమార్చి, ఆమె విడాకులు మంచిదేనని చెప్పింది. అంతకుముందే ఐర్లండ్‌లో విడాకులకు వ్యతిరేకంగా ఉద్యమించింది. ఇలా రెండు నాల్కల తీరు ఆమెకు మామూలే!

హిచిన్స్ అభిప్రాయాల ప్రకారం మదర్‌థెరిస్సా స్త్రీ విరోధి. ప్రపంచ వ్యాప్తంగా నేడు స్త్రీలకనుకూలంగా కుటుంబ నియంత్రణ జరగాలని, గర్భస్రావం అంగీకరించాలని, స్త్రీలకు సమాన హక్కులుండాలని, విడాకుల హక్కు ఉండాలని చెబుతున్నారు. మదర్‌థెరిస్సా కాథలిక్ మతాన్ని అనుసరించి ఈ అభ్యుదయ భావాలను వ్యతిరేకిస్తున్నది. ఆమె జీవితమంతా మత ప్రచారానికి, మత మార్పిడిలకు తన ఛారిటీ గృహాలను వాడుకున్నదని హిచిన్స్ విమర్శించారు. ఆయన విమర్శలను ఒక పట్టాన భక్తులు స్వీకరించలేక పోయినప్పటికీ, ఆయన చెప్పిన దాంట్లో అసత్యాలున్నాయనికాని, దురుద్దేశాలతో విమర్శిస్తున్నారని కాని అనలేకపోయారు. కోట్ల ధనం బాంకులలో మూలుగుతుండగా ఛారిటీ గృహాలకు ఎందుకు ఖర్చు పెట్టలేదని అడిగిన దానికి సమాధానం చెప్పలేకపోయారు.

పరిశోధనాత్మక జర్నలిజంలో చెప్పే సత్యాలు కటువుగా వున్నప్పటికీ దీర్ఘకాలికంగా అవి సత్యాన్వేషణకు దారితీస్తాయి. కనుక హిచిన్స్ మార్గం జర్నలిస్టులకు ఆదర్శప్రాయం.

○

సిగ్గు! సిగ్గు!! మనందరం ఆలోచించుకోవాలి... కొత్త ఫ్లై ఓవర్లు, భూగర్భ రైల్వేలు నిర్మించడానికి నిధులు కొరత లేదుగాని ధాన్యాల రవాణాకు నిధులు లేకపోవడం ఎంత హాస్యాస్పదం!

**- ధాన్యాల రవాణాకు నిధులు లేవన్న రాష్ట్ర విధానంపై ప్రసిద్ధ ఆర్థికవేత్తలు అరిందం చౌధురి, మాతా చౌధురి**

**కాంగ్రెస్** పార్టీ అధికారంలోకి రాగానే ప్రపంచబ్యాంకు షరతులను తుంగలో తొక్కుతాం

**- మాజీ సిఎల్‌పినేత వైఎస్**

**ప్రమాణాల** ప్రకారం ప్రతీ 23వేల జనాభాకు ఒక దంతవైద్యుడు అవసరం. ఆ మేరకు ఇప్పుడున్న దంతవైద్య కళాశాలలు సరిపోతాయి. దేశంలో మరిన్ని దంతవైద్య కళాశాలల ఏర్పాటు అవసరమే లేదు.

**- డాక్టర్ ఆర్.కె. బాలి (డెంటల్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా అధ్యక్షులు)**

పంచాయితీలకు కేటాయించాల్సిన నిధుల విషయంలో ఆర్థిక సంఘాలు చేసే ప్రతిపాదనలను రాష్ట్ర ప్రభుత్వాలు సరిగా పాటించడంలేదు.

**-12వ జాతీయ ఆర్థిక సంఘం, ఛైర్మన్ రంగరాజన్**

**నీటిని** ప్రైవేటీకరించడం ప్రభుత్వ నూతన జలవిధానం ఉద్దేశం. నీటికి ప్రత్యామ్నాయం లేదు. హైకోర్టు ఇటీవల వెలువరించిన తీర్పు ప్రకారం భూగర్భజలం, అడవులు, గాలిపై ప్రభుత్వాలకు ఏ హక్కులు లేవు

**- ప్లాచిమడ ప్రపంచ జలసదస్సులో వందనాశివ**

**వ్యాపారం** ప్రధానమైన పోటీ వాతావరణంలో అటవిక న్యాయం రాజ్యమేలుతోంది. కొన్ని సంవత్సరాల్లోనే ప్రపంచీకరణపై నమ్మకం కాస్తా అపనమ్మకంగా మారింది

**- దావోస్ ప్రపంచ ఆర్థిక సదస్సులో కోఫి అన్నన్**

**చంద్రబాబు** అండదండలతో మోసాలకు పాల్పడేవారి సంఖ్య రాష్ట్రంలో పెరిగిపోతుంది

**- లక్ష్మీపార్వతి**

**భారతీయుల** వారసత్వ సంపద అయిన ఆయుర్వేద వైద్య విధానాన్ని స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత అన్ని ప్రభుత్వాలు నిర్లక్ష్యం చేశాయి.

**- ఎస్.బి.పి.బి.కె. సత్యనారాయణ , (మాజీ వ్యవసాయశాఖమంత్రి)**

**ఇరాక్‌లో** జనబాహుళ్యాన్ని సామూహికంగా హతమార్చగల జీవ, రసాయన ఆయుధాల నిల్వలు లేనేలేవు.

**- హంటర్ డేవిడ్ కే (అమెరికా ఆయుధవిభాగం అధిపతి)**

**ఇరాక్** వద్ద మానవ వినాశకర ఆయుధాలు వున్నాయంటూ దేశాన్ని తప్పుదారి పట్టించినందుకు అమెరికా ఉపాధ్యక్షుడు డిక్‌చెనీ సహా బుష్ యంత్రాంగాన్ని విచారించాల్సిందే

**- సెనెటర్ జాన్‌కెర్రీ (డెమోక్రటిక్ అధ్యక్ష అభ్యర్థి)**

**పీపుల్స్‌వార్** హింసాత్మక సంఘటనటను సాకుగా చూపి అధికార తెలుగుదేశం ముందస్తు ఎన్నికలకు వెళ్లడం, ఎన్నికలకు 'వార్' సమస్యను ప్రధానాంశం చేయడం తప్పు... తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం కావడంలో తప్పేమీ లేదు. పాలనా సౌలభ్యంకోసం చిన్న రాష్ట్రాల ఏర్పాటు కావాల్సిందే

**- జయప్రకాశ్ నారాయణ్, (లోక్‌సత్తా)**

**దక్షిణాది** రాష్ట్రాలైన ఆంధ్రప్రదేశ్, కర్నాటక, తమిళనాడుల రుణభారం 2000-01 నుంచి పెరిగిపోతుంది. చర్యలు తీసుకోని పక్షంలో ఈ రాష్ట్రాలు అప్పుల ఊబిలో కూరుకుపోయే ప్రమాదం ఉంది.

**- భారతీయ పరిశ్రమల మండలి (సిఐఐ)**

# మద్యనిషేధోద్యమ విషాదం : భవిష్యత్ దర్శనం

- మల్లాది సుబ్బమ్మ

అది అక్టోబరు 2 గాంధి 125వ జన్మదినం. ఉదయం 7 గంటల కల్లా గాంధిపార్కులో గాంధి విగ్రహం చుట్టూ 200మంది స్త్రీలు చేరి మహాత్ముని మెడలో దండ వేసి ముఖ్యమంత్రిని దండవెయ్యకుండా నిరోధిద్దామని వెళ్లాము. కారణం గత రెండేళ్లుగా (2002 జూన్ నుండి) రాష్ట్రంలో సారా నిషేదోద్యమం తీవ్రస్థాయిలో జరుగుతున్నా ఏమాత్రం చలించని ప్రభుత్వంపై మహిళలు ఆవేదనను వ్యక్తపరుద్దామని ఎదురుచూస్తున్నాం. గాంధి మెడలో పూలదండ వేసే అర్హత సి.ఎం.కి లేదని నినాదాలుయిస్తూ నిలబడ్డ ఆంధ్ర మహిళలను బైటికి పొమ్మన్నారు పోలీసులు. "యిక్కడ నిలబడే హక్కు మాకు వుందని బైఠాయించాము". పట్టలేని ఆగ్రహంతో పోలీసులు మాపై లాఠీలు ఝుళిపించారు. యిద్దరి మధ్య ఘర్షణ జరిగింది. 'సి.ఎం. వస్తాడు ఖాళీ చెయ్యమని'మమ్మల్ని అదిలించారు మేము వినలేదు. మగ పోలీసులు ఆడవారిని లాగడం మొదలయ్యింది. ఇంకా పట్టలేని క్రోధంతో రక్షకభటులు మమ్మల్ని తన్నారు. లాఠీలతో కొట్టారు; చీరలు లాగారు; జాకెట్లు చింపారు; మెడలోని గొలుసులు తెగి ముక్కలయినాయి; క్రిందపడ్డారు మహిళలు. ఇంకా పెచ్చు పెరిగిన పోలీసులు బూతులు తిట్టి, ఉక్రోషంతో పొట్టల్లో గుద్దారు. బయటనుంచి రాళ్లు విసిరారు. ఆ భీభత్సకాండలో ఆడవాళ్ల జుట్టు, కాళ్లు పట్టుకొని ఒక వస్తువులా విసిరిపారేశారు. కొందరు స్త్రీలు స్పృహ కోల్పొయారు. రక్తం స్రవించింది. వారిని హాస్పటల్‌కి పంపాము. ఇంకా కోపం చల్లారని పోలీసులు నాలుగు వ్యాన్లల్లో 200మందికి పైగా స్త్రీలను అరెస్టుచేసి బొల్లారం పోలీసుస్టేషనుకి పంపారు. పూర్వం బ్రిటీష్ వారి "జలియన్ వాలాబాగ్"లా నేటి ఆంధ్ర పోలీసులు నిరాయుధులైన ఆంధ్ర స్త్రీలపై జరిపిన దమనకాండ ఇది. ఈ సంఘటన మద్యనిషేధోద్యమ చరిత్రలో ఒక పర్వం మాత్రమే.

'కల్లు మానండోయ్ బాబూ కళ్లు తెరవండోయ్' అనే నినాదంతో మద్య నిషేధాన్ని మహాత్మాగాంధీ 1920లో ప్రతిపాదించారు. అది ఆయన నడిపిన 1921, 1930, 1932 ఉద్యమాల్లో ముఖ్య కార్యక్రమమయింది. 1934లో ఆయన సాగించిన నిర్మాణ కార్యక్రమంలో ప్రాముఖ్యత గల అంశం అయింది. ఆనాడే కల్లు పాకలవద్ద స్త్రీలచేత పికెటింగులు చేయించాడు. ధర్నాలు, ప్రదర్శనలు, సభలు, సమావేశాలు నడిపించాడు. 1937లో ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో అధికారానికి వచ్చిన కాంగ్రెసు మంత్రివర్గం రాష్ట్రంలోని రెండు జిల్లాలలో ( సేలం, చిత్తూరు) మద్యనిషేధాన్ని ప్రవేశపెట్టింది. 1939లో కాంగ్రెసు మంత్రివర్గ రాజీనామాతో ఆనాడు అది అంతటితో అంతమయ్యింది. 1946లో తిరిగి ప్రకాశం పంతులుగారు ముఖ్యమంత్రిగా కాంగ్రెసు మంత్రివర్గం ఏర్పడింది. మద్యనిషేధాన్ని మరల ప్రవేశపెట్టింది. 1950లో భారత రాజ్యాంగం 47వ అధికరణంలో ఉటంకించారు. వైద్యానికి తప్ప ఆరోగ్యానికి భంగకరమయ్యే మత్తు పానీయాల, మత్తుమందుల వినియోగాన్ని నిషేధించటానికి రాజ్యం కృషి చెయ్యాలని మార్గదర్శక సూత్రాలలో భాగంగా 47వ అధికరణాన్ని రూపొందించింది రాజ్యాంగ నిర్ణయ సభ. 1950 నుండి రాజ్యాంగం అమలులోకి వచ్చినా కేంద్ర ప్రభుత్వం ఈ అధికరణాన్ని అమలుచేయడానికి ప్రయత్నించలేదు. 1946లో ప్రవేశపెట్టబడిన మద్యనిషేధం 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత కూడా ఆంధ్ర ప్రాంతంలో కొనసాగింది. చివరకు అది విఫలం అయిందని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం దానిని 1969లో రద్దుచేసింది.

మహిళల మండే గుండెల్లోంచి వచ్చిన ఆవేదనా ఫలితమే నెల్లూరు మద్య నిషేధోద్యమం. 1992 సెప్టెంబరు 12న నలభై వేలమంది రోశమ్మలాంటి మహిళలు సారా దుకాణాలను మూయించారు. ఏ రాజకీయ ప్రాబల్యం లేకుండా నలభై వేల మంది మహిళలు దూబగుంట గ్రామంలో సారా కాంట్రాక్టర్ల దౌర్జన్యాలను ప్రతిఘటిస్తూ వేలం పాటలను ఆపిన రోజున ఉద్వేగం లాంటి వార్త విన్న నాలో అగ్నిజ్వాల బ్రద్దలయింది. గత 20ఏళ్లుగా నేనొక "కుటుంబ సలహా కేంద్రాన్ని" నడుపుతున్నాను. మా కేంద్రానికి వచ్చిన కేసుల్లో సగం త్రాగుడు మైకంలో భర్తలు జరిపే దాష్టికాలే దానికి కారణం. త్రాగిన సీసాతో భార్య తలను పగులకొట్టేవారు, సిగరెట్లతో కాల్చేవారు, కొరికేవారు, కొట్టేవారు, వెళ్ళగొట్టేవారు పురుషులైతే, కష్టాలు, బాధలు అనుభవించేవారు ఆడవారు. మద్యపాన నిషేధోద్యమం కేవలం ఒక సాంఘిక సంస్కరణే కాదు; మహిళా విముక్తి ఉద్యమం కూడా అనే ధ్యేయంతో స్పందించి మేమంతా ఉద్యమంలోకి దూకి 1992 అక్టోబరు 1న బ్యానర్లతో, ప్లే కార్డులతో 1500 మంది మహిళల ఊరేగింపు జరిపి వెంటనే ఒక సభని నిర్వహించి గవర్నమెంటుకి మెమోరాండం సమర్పించాం. నాటినుండి సెమినార్లు, సభలు, వర్కుషాపులు నిర్వహించాం. 'ఐక్యవేదిక' స్థాపించి ధర్నాలు, సభలు, కార్యక్రమాలు నిర్వహించి అనేక పత్రికలలో ప్రతిరోజు సారా పైశాచికత్వాన్ని గురించి వ్రాసే వాళ్లం. అలాగే అశేషంగా స్త్రీ పురుషులు, అనేక సంస్థలవారు, విద్యార్థి బృందాలు, పత్రికలవారు తారాస్థాయిలో నిషేధాన్ని కోరుతూ

పోరాటాలు చేశారు. రాస్తారోఖోలు, నిరాహార దీక్షలు, మానవహారాలు ప్రతిదినం నిర్వహించాం. ఉద్యమ కార్యకర్తలైన మమ్మల్ని అనేకసార్లు అరెస్టుచేశారు. అయినా దృఢ దీక్షతో నిలబడి రోజుకొకటి రెండు సంచలనాత్మక కార్యక్రమాలను నిర్వహించేవాళ్లం. మమ్మల్ని ఎన్నోసార్లు హౌస్ అరెస్టు చేశారు. ఉద్యమం తీవ్రస్థాయికి చేరింది. గత్యంతరం లేక 2/10/1993 నుండి 'సారా'ను మాత్రం నిషేధించి అంచెలవారీ 'సంపూర్ణ మద్యనిషేధాన్ని' అమలుపరుస్తామని ప్రకటించింది రాష్ట్ర ప్రభుత్వం. హర్షించారు ప్రజలు.

నగరంలోని 39 మహిళా సంఘాలు, మహిళాభ్యుదయ సంస్థ కలిసి 1-10-1992న హైదరాబాదులో ప్రదర్శన, బహిరంగ సభలకు పిలుపునిచ్చారు. అందులో శ్రీమతి వసంతా కన్నభిరాన్, ఒల్గా, నేను, జంధ్యాల కామేశ్వరి, శాంతాసిన్హా, స్నేహలత, ఇంకా చెప్పాలంటే 1000మంది స్త్రీ పురుషులు, మాజీ గవర్నరు కుముద్‌బెన్ జోషి, కాంగ్రెసుకు చెందిన మహిళలు ప్లేకార్డులతో బారులుతీరి సారా వ్యతిరేక ప్రదర్శనలో పాల్గొన్నాం. ఫిరోజ్‌గాంధి పార్కు నుండి బుద్ధపూర్ణిమకు చేరుతుంది ప్రదర్శన. చంటిపిల్లలతో, పాలసీసాలతో, విదేశీ విద్యార్థినులు కూడా ఊపుగా వచ్చి పాల్గొన్నారు. ఈ ప్రజా వాహినిని టి.వి.లవారు, బి.బి.సి. వారు, పత్రికల వారు దారిపొడవునా ఫిల్ముతీశారు. రేడియోవారు కూడా వార్తల్లో న్యూసు చెప్పారు. ముఖ్యంగా 'ఈనాడు' వారు ఫోటోలతో, హెడ్‌లైన్లతో నాటినుండి నిషేధించేవరకు రోజూ రెండు పేజీల న్యూసు ప్రచురించేవారు.

1992 అక్టోబరు 9న శ్రీ కోట్ల విజయభాస్కరరెడ్డి ముఖ్యమంత్రి అయినాడు. 26-6-93న రాష్ట్ర ప్రభుత్వం జిల్లాలవారి 25 మంది సభ్యులు కల ప్రభుత్వేతర కమిటీని నిషేధ ప్రచార నిమిత్తం నియమించింది. దానికి వావిలాల అధ్యక్షులు. నేను ఉపాధ్యక్షురాలిగా, శ్రీమతులు సరస్వతీరావు, సుగుణమతి, సినీనటి శారద, సంయుక్త బుల్లెయ్య, శిశిర్ రాజగోపాలన్, ఇల్లిందుల సరస్వతీదేవి, బిల్కిస్ లతీఫ్, డా॥ శ్రీదేవి, బాట్టం శ్రీరామమూర్తి మెంబర్లు. వీరికి ఒక సంవత్సర పదవీకాలాన్ని 440 జి.వో. ప్రకారం నిర్ణయించి రెండు కోట్ల రూపాయలు కరపత్రాలు, ఇతర మా ప్రయాణ ఖర్చులకు కేటాయించారు. 2/1/93న శ్రీ రామోజీరావు బ్రహ్మాండమైన సభను ఏర్పాటుచేసి గవర్నరు కృష్ణకాంత్, విజయభాస్కరరెడ్డి, ఎన్.టి.ఆర్ మమ్మల్ని సారా వ్యతిరేక పోరాట రాష్ట్ర కమిటీ సభ్యులను ఆహ్వానించారు. ఆ సభలో ఎన్.టి.ఆర్ మాట్లాడుతూ ప్రభుత్వానికి డబ్బే ముఖ్యమైతే వ్యభిచార గృహాలను నడిపి ధనార్జన చేయవచ్చు కదా!" అన్నాడు. దానిపై ఆగ్రహించిన గవర్నరు కృష్ణకాంత్, ముఖ్యమంత్రి విజయభాస్కరరెడ్డి వెళ్లిపోయారు. ఇరువర్గాలు కాంగ్రెసు, తెలుగుదేశం రణరంగంలోకి దిగారు.

1/10/93న రాష్ట్ర ప్రభుత్వం సారా నిషేధాన్ని రాష్ట్రమంతటా ప్రవేశపెట్టారు. మా ప్రచారకమిటీ జిల్లాలంతటా పర్యటించి అనేక సభలు, సమావేశాలు, వర్కుషాపులు నిర్వహించాం. కలెక్టర్లు, ఎక్సయిజు అధికారులు మాకెంతో సహకరించారు. ఈ దశలో ప్రభుత్వం తమ డబ్బుకోసం 'చీప్ లిక్కరు'ను /ఐ.ఎం.ఎఫ్.ఎల్/ /సీసా సారాను/ ప్రవేశపెట్టింది. ఇంతవరకు 10రూ.లు మాత్రమే రోజుకు ఖర్చు చేసేవారు ఇప్పుడు 40, 50రూ.లు మద్యానికి వెచ్చిస్తున్నారు. ఈ విషయాన్ని గ్రామాలలోని స్త్రీలు బాధపడుతూ తమ భర్తలు చీప్ లిక్కరు త్రాగి కుటుంబాలు కూలుస్తున్నారని విన్నవించారు. వావిలాలతోపాటు మేమందరం ముఖ్యమంత్రిని కలిసి ఐ.ఎం.ఎఫ్.ఎల్‌ను కూడా నిషేధించమని విజ్ఞప్తి చేశాం. ఈ సందర్భంగా మా ప్రచార కమిటీ పదవీ కాలాన్ని ఇంకొక సంవత్సరానికి పెంచారు. కానీ 'చీప్ లిక్కర్'ని ఆపని ప్రభుత్వంపై ఆగ్రహించి వావిలాల, నేను ముందుగా రాజీనామా యిచ్చాం. కొద్దిరోజుల్లో కమిటీ కూడా పూర్తిగా రద్దయింది.

1992, 93లో ప్రభుత్వ రాబడి సారా వల్ల 34 కోట్లయితే 'చీప్ లిక్కరు' వచ్చాక 50కోట్ల దాకా పెరిగింది. తదుపరి కాంగ్రెసు ఓడించి ఎన్.టి.ఆర్ అధికారంలోకి వచ్చాడు. వెంటనే కల్లు మినహా రాష్ట్రమంతటా మద్యాన్ని నిషేధించాడు. ఈ ప్రకటనకు రాష్ట్ర ప్రజలు హర్షించారు. కొద్ది రోజుల తర్వాత ఎన్.టి.ఆర్‌ను పడగొట్టి చంద్రబాబునాయుడు సి.ఎం. స్థానాన్ని ఆక్రమించాడు. ఎన్ని కష్టాలయినా, ఎన్ని నష్టాలయినా మద్యపాన నిషేధాన్ని అమలుపరుస్తానని వాగ్దానం చేశాడు. కొద్ది కాలానికే డబ్బు కొరకు నిషేధాన్ని పూర్తిగా ఎత్తివేశాడు. మా కార్యకర్తలందరూ వెళ్లి ఆయన ఎదుట 'ఇది అన్యాయం? అక్రమం? నీతి బాహ్యం? మాట తప్పటం కాదా?' అని నిష్టూరంగా మాట్లాడాం. "నిషేధాన్ని అమలుపరిస్తే మీకు సంతోషం లేకపోతే మా ఆదాయానికి గండిపడుతుందని' మా సహచరులు వ్యతిరేకిస్తున్నారని అన్నప్పుడు 'మీరేకదా! ముఖ్యులు. వాగ్దానం చేసింది మీరేకదా!' అని మేమెంత వాదించినా ఫలితం శూన్యమయింది. ఆ రోజు అసెంబ్లీకి వెళ్ళి మేము ప్రతిఘటిస్తే పోలీసులు మమ్మల్ని ఎత్తి వ్యాన్లలో పడేసి బొల్లారం పోలీస్ స్టేషనులో పెట్టారు. ఇంతటితో ఆనాటి మద్యపాన నిషేధ ప్రకటన, ఎత్తివేయటం చాలా ఘోరంగా జరిగింది. అసలు ఇది ప్రజాస్వామికమేనా? అశేష ప్రజలు త్యాగాలు చేసి, కష్టాలు పడి జైళ్లకెళ్లి పోరాటాలు జరిపిన దీర్ఘకాలిక పోరాట ఫలితం ప్రభుత్వ ముద్రతో ప్రజల్ని వెన్నుపోటు పొడిచిందనడంలో సందేహం లేదు.

1993లో సాధించుకున్న మద్యనిషేధం మొదటినుండి స్వార్థ, నీతిమాలిన రాజకీయనేతల వెన్నుపోటుకు గురవుతూనే వుంది. తెలుగుదేశ ప్రభుత్వం అధికారంలోకి వచ్చినప్పుడు నిషేధాన్ని కఠినంగా

అమలుపరుస్తామని ఎన్నికల ప్రణాళికలో స్పష్టంగా హామీ యిచ్చింది. ఈ సాహసోపేత నిర్ణయం తీసుకున్న ఎన్.టి.ఆర్ ప్రభుత్వం 100రోజుల విజయోత్సవాన్ని జరుపుకుంటూ మద్యనిషేధ సత్ఫలితాలనెన్నింటినో ఏకకరువు పెట్టింది. రక్తం ధారపోశయినా ఈ పథకాలను నిలుపుతానని 'ప్రజలు తమ మద్దతునుయిచ్చి త్యాగాలకు సిద్ధంకమ్మని' పిలుపునిచ్చింది. కాని చంద్రబాబు ప్రభుత్వం గ్రామీణ స్థాయి వరకు సిట్టింగ్‌బార్‌లకు అనుమతిచ్చేవరకు దిగజారింది. మద్యం అమ్మకాలు పెంచటానికి 174జి.వో. ద్వారా విస్తృతంగా లైసెన్సులను మంజూరు చేసింది. ఇంకా చెప్పాలంటే అర్ధరాత్రివరకు బార్‌లను తెరవడానికి అనుమతినిచ్చే 345జి.వోను కూడా అమలుచేసింది. నూతన ఎక్సైయిజు విధానాల పేరుతో విచ్చలవిడిగా లైసెన్సులను యివ్వడంతో రాష్ట్రమంతటా మామూలుగా లక్షకు పైగా షాపులు వెలిశాయి. వాటికి బెల్టుషాపుల పేరుతో మరో 40వేలు తోడయినాయి. వీటితో మద్యం పెరగడమేకాక నేరాలు కూడా పెరిగాయి. అనేకచోట్ల కల్తీ మద్యం త్రాగి వ్యసనపరులు ప్రాణాలు కోల్పోతున్నారు. సైనెడ్ కలిపిన మద్యం సేవించి ఎంతోమంది మరణిస్తున్నారు. ఈ మద్యం అమ్మకం వల్ల వచ్చిన ఆదాయం వల్ల ప్రజల అభివృద్ధి కార్యక్రమాలు జరిగాయా అంటే శూన్యమని చెప్పవచ్చు. ఈనాడు 50వేల కోట్ల ఆదాయాన్ని సంపాదిస్తోంది. త్రాగుబోతులు 15వేల కోట్లు ఖర్చుపెడుతున్నారు. ఈ దుర్వ్యసనం కేవలం మహిళల సమస్యే కాదు. సామాజిక, ఆర్థికపరమైన శాంతిభద్రతలు కూడా నశిస్తున్నాయి. ఈ బార్‌ల వల్ల సెక్స్ డాన్సులు, అర్థ నగ్న దృశ్యాలు చూచి యువత పెడదారి పడుతోంది. ముఖ్యంగా త్రాగుడువల్ల కుటుంబాలు కూలిపోతున్నాయి. ఇక స్త్రీల అగచాట్లు వర్ణనాతీతం. భర్తలు తమ కూలి డబ్బులతో త్రాగి అది చాలక భార్య కూలి డబ్బులతో కూడా త్రాగి పైగా పిల్లల యూనిఫాం అమ్ముకునేవాళ్లు. పిల్లల్ని కూడా అమ్మిన కేసు మా వద్దకు వచ్చింది. త్రాగిన మైకంలో ఒక తండ్రి కూతురిని చెరిస్తే ఆమె గర్భవతి అయిన ఉదంతం కూడా వుంది.

ఇంతకాలం అజ్ఞానం వల్ల దూరదృష్టి లేమివల్ల పడివున్న స్త్రీలు ఈనాడు చావో, బ్రతుకో తేల్చుకోవాలసి ఉద్యమాల్లోకి దూకుతున్నారు. భరించలేనప్పుడు డార్విన్ అన్నట్లు ఎంత అణచబడ్డ జీవి అయినా తలెత్తక మానదు. అలాగే మద్యనిషేధ ఉద్యమం కూడా. ముఖ్యంగా ఈ ఘాతుకాలు ధనవంతులు, మధ్యతరగతి, పేదవారు మూడు వర్గాలలో జరుగుతున్నాయని మనకు తెలుసు. అందుకే ఇదొక దీర్ఘకాలిక పోరాటమయింది. ప్రజలు మనస్ఫూర్తిగా నిషేధాన్ని కోరినప్పుడు ప్రభుత్వం ఇన్ని అడ్డంకులను తేవడంలో ఎంతో కుట్ర వుంది. 'మాకు సారా వద్దు. మా బ్రతుకుల్ని మమ్మల్ని బ్రతకనివ్వండ'ని త్రాగేవారు సైతం గగ్గోలుపెడుతుంటే "మీరు సారా త్రాగి మాకు డబ్బు చెల్లించండి. మీ ఆరోగ్యాలు పోయినా, మీ పిల్లలు సర్వనాశనమైనా, మీ భార్యలను కొట్టినా, మీ కాపురాలు సర్వనాశనమయినా మేము నిషేధించం. మాకు డబ్బు కావాల"నడం ఎంత ఘోరమో! అసలు ఇది ప్రజాస్వామికమేనా? అంటే తప్పులేదు. మనం ఈనాడు నిరంకుశఛాయల్లో బ్రతుకుతున్నాం. లేకపోతే ప్రజల్ని బాగుచెయ్యాల్సింది పోయి 'మేము బాగుపడతాం! మా భర్తల్ని మేము సరిదిద్దుకుంటాం!' అంటుంటే 'అక్కర్లేదు మీకు సౌకర్యాలు మేము కల్పిస్తాం!' అంటోంది ప్రభుత్వం. అసలు ప్రభుత్వం అంటే మన ఏజంట్లే కదా! మన టాక్సులతోనే కదా! ఏర్పడింది. యథా రాజా తథా ప్రజా అన్నట్లు వారు మన సంక్షేమాన్ని కాంక్షించటమేకదా వారి బాధ్యత. 'మా ఆదాయం కోసం మీరు త్రాగండి!' అనడం క్షంతవ్యం కాదు. ఎలా ఆలోచించినా ప్రభుత్వ ధనదాహం ప్రజల నిర్వీర్యతలే కదా మద్యనిషేధానికి అడ్డుకట్టలై సారాపరులై పారి మానవ జీవితాలను సర్వనాశనం చేస్తోంది.

మత్తు పదార్థాల వాడకంతో మనిషిలోని హేతుత్వశక్తి నశిస్తుంది. ఇంగితజ్ఞానం కోల్పోవడం సంభవిస్తుంది. మనిషి హుందాకు, హోదాకు ఆశ నిఘాతం ఏర్పడుతుంది. కుటుంబంలోని స్త్రీల, పిల్లల ఆరోగ్యాన్ని, సంక్షేమాన్ని, హింసల నుండి విముక్తికి, ఆత్మగౌరవాన్ని పెంపొందించడానికి మద్యనిషేధం అత్యవసరం. త్రాగే హక్కు మౌలికహక్కుని వాదించేవారూ వున్నారు. నిజానికి మౌలికహక్కులు నిర్నిబంధమైన హక్కులు కావు. సభ్యత, నీతి, ప్రజాభద్రత అనే అంశాలు వాటికి పరిమితులను విధిస్తున్నాయి. కాలమాన పరిస్థితులనుబట్టి వీటిని అర్థం చేసుకోవడంలో వుంది. ఒకరినిచూచి మరొకరు త్రాగుతున్నారు. విచక్షణాజ్ఞానాన్ని వమ్ముచేసే మద్యం వల్ల అమాయక ప్రజలు అశక్తతను పెంచుకుంటున్నారు.

ఇలా 1921 నుండి వివిధ దశలలో వివిధ పోరాటాలు జరిగాయి. ప్రతిసారి ప్రభుత్వమే స్వైర విహారం చేస్తోంది. ప్రజలు నిర్వీర్యులై, బాధాసర్పదష్టులై బలి అవుతున్నారు. ప్రజాబలం కన్నా అర్థబలం, అధికారబలం, సైనికబలం, ఆయుధబలం మిన్న అని ఈ మద్యనిషేధ చరిత్ర చాటిచెప్తోంది. అయినా పట్టువీడని ధైర్యసాహసాలు, త్యాగాలు, నీతినిజాయితీలు ప్రజలకు పెట్టనికోటలు. ఆ ఆశతోనే మనం భవిష్యత్ దర్శనం కోసం వెయ్యికళ్లతో కాచుకొని చూస్తున్నాం. ఇది గతించిన 1995 నాటి మద్యనిషేధ విషాధ గత చరిత్ర. ఇది మన హృదయాలను కలిచివేసిన, మన హయాంలో జరిగిన చరిత్ర. ఇది మన ఉద్యమాన్ని ఉక్కుపాదాలతో త్రొక్కేసిన విషాధగాథ. అయినా పౌరుషం కల ఆంధ్రులు తిరిగి 7-9-2003 నుండి 'మద్య వ్యతిరేక ఐక్యవేదిక' సన్నాహక కమిటీ పేరుతో తిరిగి ప్రారంభించాం. ఆ ఉద్యమం ఇప్పటికే రూపందుకొంది. వచ్చే సంచికలో ఆ వివరాలు అందిస్తాను.

*(మిగిలిపోయింది)*

# పచ్చని స్వర్ణాంధ్రలో ప్రాణాలు తీసే పి.వి.సి. ప్లాస్టిక్ పరిశ్రమలా?

(రాష్ట్రంలో పర్యావరణ కాలుష్యం విపరీతంగా విస్తరిస్తుంది. అడపా దడపా పత్రికలో కాలుష్యానికి సంబంధించిన వార్తలు, వ్యాసాలు, కథనాలు వెలువడుతూనే ఉన్నాయి. దీనిపై అనేక స్వచ్ఛంద సంస్థలు, పర్యావరణ వేత్తలు విశేషంగా కృషి చేస్తూనే వున్నారు. అందులో కెప్టెన్ జె.రామారావు ఒకరు. ఆయన ఆధ్వర్యంలో ఏర్పాటు చేయబడిన 'సమృతి' (పర్యావరణ పరిరక్షణ సంస్థ) పర్యావరణం అంశంలో చేసిన కృషికి సంబంధించిన పరిశోధనోత్మక పత్రాల్ని ఈ సంచిక నుండి ప్రతి సంచికలోనూ ఒకటి చొప్పున ప్రచురిస్తామని తెలుపుతున్నాం.)

-సం.)

ప్రాణాలు తీసే ప్లాస్టిక్‌గా పేరొందిన పివిసి (పాలి వినైల్ క్లోరైడ్) ప్లాస్టిక్ తయారీ, వాడకం, తరువాత పారేయడంపై ప్రపంచ వ్యాప్తంగా నిరసన వ్యక్తమవుతోంది. ఇటువంటి పివిసి కర్మాగారాలను ప్రపంచమంతా వ్యతిరేకిస్తుంది. దేశంలోని చట్టాలు, నిబంధనలు కూడా ఇటువంటి ప్లాంట్‌లను ఏర్పాటు చేయవద్దంటున్నాయి. వీటి కారణంగా కాలుష్యం విపరీతంగా పెరిగిపోయి జనం క్యాన్సర్ బారిన పడతారని అంతర్జాతీయ పర్యావరణ పరిశోధనలు హెచ్చరిస్తున్నాయి. క్యాన్సర్ వ్యాధికి ప్రధాన కారకమైన కార్సినోజన్‌లు ఇందులో ఎక్కువగా వుండడమే ఇందుకు కారణం. చివరికి మన పక్కన వున్న తమిళనాడు కూడా ఈ ప్రాజెక్ట్ ఏర్పాటును వ్యతిరేకించి అనుమతిని నిరాకరించింది. అయితే విచిత్రంగా పెట్టుబడుల మత్తులో వున్న మన ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ప్రపంచమంతా తిరస్కరిస్తున్న, వ్యతిరేకిస్తున్న కాలుష్య కారక పి.వి.సి. ప్లాంట్‌కు స్వాగతం పలుకుతున్నారు. రాష్ట్రాన్ని పరిశుభ్రంగా, పచ్చదనంతో తీర్చిదిద్దుతానని పదే పదే ప్రకటించే నోటితోనే కాలుష్య పరిశ్రమకు నిబంధనలకు విరుద్ధంగా అనుమతులు మంజూరు చేస్తానని హామీలు ఇస్తున్నారు. 500 కోట్ల రూపాయల పెట్టుబడులు వస్తాయన్న భ్రమలో రాష్ట్ర ముఖ్యమంత్రి తమిళనాడు ప్రభుత్వం తిరస్కరించిన 'కెమ్‌ప్లాస్ట్ సన్మార్' కంపెనీకి చెందిన పివిసి ప్లాంట్‌ను ఆంధ్రకు ఆహ్వానిస్తున్నారు. తమిళనాడులోని కడలూరు వద్ద అంతర్జాతీయ వాణిజ్య సంస్థ (ఐఎఫ్‌సి) సహకారంతో ఏర్పాటు చేయతలపెట్టిన ఈ ప్లాంట్ చాలా ప్రమాదకరమైనదంటూ అక్కడి ప్రజలతో పాటు ప్రజాప్రతినిధులు, ఎన్‌జివోలు, స్థానిక సంస్థలు, పర్యావరణవేత్తలు వ్యతిరేకించడంతో తమిళనాడు ప్రభుత్వం అనుమతిని నిరాకరించింది. ఈ ప్లాంట్‌కు వ్యతిరేకంగా ఐ.ఎఫ్.సి.కి వందలాది ఉత్తరాలు వెళ్ళడంతో ఆర్థికసాయం కూడా అయోమయంలో పడింది. 2002వ సంవత్సరంలో 1.70 లక్షల టన్నుల సామర్థ్యంతో కడలూరులో నెలకొల్పతలపెట్టిన ఈ ప్లాంట్‌ను పబ్లిక్ హియరింగ్ సమయంలో చుట్టుపక్కల నివశించే సీమ్మన్‌కుప్పం, ఇచ్చన్‌గాడు, సోనంచవాడి పంచాయితీల ప్రజలు తీవ్రంగా వ్యతిరేకించారు. ఈ దశలో ఆంధ్ర ముఖ్యమంత్రి కల్పించుకొని సులువుగా అనుమతులన్నీ మంజూరు చేస్తామని ఆ కంపెనీ ప్రతినిధులకు హామీ ఇచ్చి నెల్లూరు జిల్లా కృష్ణపట్నం వద్ద ఏడాదికి రెండు లక్షల టన్నుల సామర్థ్యంతో పని చేసే ఈ ప్లాంట్ నెలకొల్పాల్సిందిగా కోరారు. ఈ మేరకు ప్రయత్నాలు ముమ్మరంగా జరుగుతున్నాయి.

పర్యావరణంపై ఐక్యరాజ్య సమితి స్టాక్‌హోమ్‌లో జరిపిన పివోసి (ప్రిసెస్టింట్ ఆర్గానిక్ పొల్యూటెంట్స్) సదస్సు కూడా పి.వి.సి. ప్లాస్టిక్ తయారీపై తీవ్రంగా విరుచుకుపడింది. ఆ సదస్సులో పాల్గొన్న భారతదేశం కూడా పివిసి తయారీకి సంబంధించి కఠిన నిబంధనలు అమలులోకి తీసుకువస్తున్నట్లు ప్రకటించింది. ఈ ప్లాంట్ ఏర్పాటు వల్ల వచ్చే డయాక్సిన్‌లు చాలా ప్రమాదకరమైనవని వాటిని అదుపులో ఉంచేందుకు భారత్ వంటి దేశాలు చర్యలు తీసుకోవాలని సదస్సు స్పష్టం చేసింది. అయితే ఇప్పుడు ఆ నిబంధనలకు విరుద్ధంగా కృష్ణపట్నం ప్లాంట్ ఏర్పాటు కానుంది. ఈ ప్లాంట్‌కు ప్రధాన ముడి సరుకు అయిన వినైల్ క్లోరైడ్ మనోమర్ (విసిఎం) మనుషుల్లోనే కాదు జంతువులలో కూడా క్యాన్సర్ కారణమవుతుందని దీనిపై పరిశోధనలు జరిపిన ఐక్యరాజ్యసమితి పర్యావరణ పరిరక్షణ సంస్థ, అంతర్జాతీయ క్యాన్సర్ పరిశోధనా సంస్థలు నిర్ధారించాయి. వి.సి.ఎం. ఫ్యాక్టరీలలో పని చేస్తున్న కార్మికులపై జరిపిన పరిశోధనలు కూడా దీనిని ధృవీకరించాయి.

ఈ ప్లాంట్ ఏర్పాటు కోసం జరిగిన పబ్లిక్ హియరింగ్‌లో విసిఎం కారణంగా తలెత్తే ఆరోగ్యపరమైన సమస్యలపై పర్యావరణవేత్తలు

లేవనెత్తిన సందేహాలకు సమాధానాలు లభించలేదు. అంతర్జాతీయంగా కూడా ఈ ప్లాంట్ పట్ల సర్వత్రా నిరసన వ్యక్తమవుతోంది. అమెరికా ఆర్థిక విభాగం చెమ్‌ప్లాస్ట్ పివిసి ప్లాంట్ పట్ల అప్రమత్తంగా ఉండాలని హెచ్చరించింది. అమెరికా కాంగ్రెస్‌కు చెందిన ఐదుగురు సభ్యులు ఈ ప్లాంట్‌కు ఎటువంటి ఆర్థిక సహాయం చేయవద్దంటూ ఐఎఫ్‌సికి లేఖ రాశారు. ప్రపంచ బ్యాంక్ రుణ సాయంతో ఏర్పాటయ్యే ప్లాంట్‌లపై దర్యాప్తు జరిపి కంప్లైయన్స్ ఆడిట్ అంబుడ్స్‌మెన్ (సిఏఓ) కూడా ఈ పివిసి ప్లాంట్‌కు వ్యతిరేకంగా వచ్చిన ఫిర్యాదులను పరిశీలించింది.

అంతేకాదు, ప్రస్తుతం చెమ్‌ప్లాస్ట్ తమిళనాడులోని మెట్టూరులో నడుపుతున్న పివిసి ప్లాంట్ బాగా నడుస్తుందా అంటే అదీలేదు. మెర్క్యూరీ, క్లోరినేటెట్ విష పదార్థాలను బయటకు వదులుతూ అక్కడి ప్రజల ప్రాణాలతో పివిసి ప్లాంట్ చెలగాటమాడుతుంది. కాలుష్యానికి సంబంధించిన ఈ విషయాలన్నింటినీ దాచేస్తూ ప్లాంట్ యాజమాన్యం తప్పుడు నివేదికలతో అందరినీ తప్పుదారి పట్టిస్తోంది. ఆ ప్లాంట్ సమర్పించిన తప్పుడు పర్యావరణ నివేదిక సైతం ప్లాంట్ వదిలే కాలుష్యాలు ప్రమాదకరమైనవన్న విషయాన్ని దాచలేకపోయాయని అమెరికాకు చెందిన ఎన్విరాన్‌మెంటల్ లాయర్స్ అలయన్స్ వరల్డ్‌వైడ్ సంస్థ ప్రతినిధి డాక్టర్ మార్క్ చార్నిక్ స్పష్టం చేశారు.

ప్రాణాంతక ప్లాస్టిక్ ప్లాంట్ పట్ల ప్రపంచ వ్యాప్తంగా వ్యతిరేకత వ్యక్తమవుతుండగా అందుకు విరుద్ధంగా రాష్ట్ర ముఖ్యమంత్రి ఆ ప్లాంట్‌కు స్వాగతం పలకడం ఎంతవరకు సమంజసం? అభివృద్ధికి ఎవ్వరూ వ్యతిరేకం కాదు. అలా అని ప్రజల ప్రాణాలతో చెలగాటమాడే కాలుష్య కారక పరిశ్రమలను తెచ్చిపెట్టడం ఏ విధంగా న్యాయం, సమర్ధనీయం? ప్రభుత్వ నిబంధనలకు లోబడి ప్రజల ప్రాథమిక హక్కులకు భంగం కలిగించకుండా వచ్చే పెట్టుబడులను, పరిశ్రమలను ఎవ్వరూ కాదనరు. సమ్మతి కూడా అటువంటి అభివృద్ధినే కాంక్షిస్తుంది.

ఓ క్షణం కాలుష్యం సంగతి మరిచిపోదాం. ఈ ప్లాస్టిక్ ప్లాంట్‌లో ప్రమాదమంటూ జరిగితే ఫలితమేమిటో తెలుసా? ప్లాంట్ పరిసరాల్లోని గ్రామాలన్నీ తుడిచిపెట్టుకుపోతాయి. మనుషులే కాదు పశుపక్ష్యాదులు కూడా మిగలవు. ప్రమాద ప్రభావం కొన్ని తరాల వరకూ కనిపిస్తూనే వుంటుంది. తమిళనాడు ప్రజలకు సురక్షితం కాని ఈ ప్లాంట్ ఆంధ్రులకు ఏ విధంగా సురక్షితం అవుతుందో పదే పదే పరిశుభ్రతతో కూడిన పచ్చని స్వర్ణాంధ్రప్రదేశ్ గురించి ప్రవచించే ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు గారే చెప్పాలి?

○

*(11వ పేజీ తరువాయి)*

## సెన్సెక్స్ విన్యాసాలు

'ఎన్ఎస్ఇ' వైరస్ కారణంగా అనేక ట్రేడింగ్ టర్మినళ్లను మూసివేసినట్టుగా పుకార్లు వెలువడ్డాయి. అంతే హఠాత్తుగా సెన్సెక్స్ పతనం ప్రారంభం అయింది. ఇతర సూచికలైన 'నిఫ్టీ', 'ఎస్ అండ్ పి'లు కూడా గణనీయంగా పడిపోయాయి. గత రెండు సెషన్స్‌లో వచ్చిన లాభాలు తుడిచిపెట్టుకుపోయాయి. ఏమాత్రం కొంత పెరుగుదల కనిపించినా అధిక సంఖ్యలో అమ్మకాలు జరిగాయి.

ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే టెక్నాలజీ కంపెనీలు ప్రకటించిన త్రైమాసిక ఫలితాలు ఎంతో అనుకూలంగా వున్నా, ఈ వాటాలు కూడా గణనీయంగా అమ్మకాలకు లోనై సెన్సెక్స్ పతనాన్ని ఆపలేకపోయాయి.

అయితే "మూడి ఇన్వెస్టర్ సర్వీసెస్" అన్న అంతర్జాతీయ ఏజెన్సీ యొక్క రేటింగ్ ఇండియా ఇన్వెస్టుమెంట్లకు అనుగుణంగా వెలుబడడంతో 23 జనవరిన ఇన్వెస్టర్లలో తిరిగి ఆశావహ స్థితి కనిపించింది. స్టాక్ మార్కెట్లు తిరిగి పుంజుకున్నాయి. 5816.64 పాయింట్లతో సెన్సెక్స్ ముగియడంతో ఇన్వెస్టర్లు భయాందోళనకు స్వస్తి చెప్పినట్టు, తిరిగి కొనుగోళ్ళ వైపు దృష్టి సారించారని చెప్పకనే చెప్పినట్టయింది. జనవరి చివరివారాల్లో తిరిగి 6000 పాయింట్లకు సెన్సెక్స్ చేరుకుంటుందన్న నమ్మకం అందరిలోనూ కలిగింది. అయితే రాబోయే నెలలో రాజకీయ పరిణామాలు కొంతమేరకు సెన్సెక్స్‌ను పతనం అయ్యేలా చేయవచ్చు. ఈవిధంగా సెన్సెక్స్ పతనమవుతూ, పుంజుకుంటూనే ఉంటుంది. ఇదే సెన్సెక్స్ విన్యాసం.

"పునరపి పతనం పునరపి పుంజుకోవడం".

○

**వీక్షణం** చందాదారులు కాగోరువారు 'సమతా పబ్లికేషన్స్' పేర రూ. 140/–లను డి.డి.గా కింది అడ్రసుకు పంపించగలరు.

వి.హనుమంతరావు, ఇం.నెం. 8-3-898/22, రోడ్ నెం. 3, నాగార్జుననగర్, హైదరాబాద్ – 500 073.

Owned, Printed and Published by **V.Hanumantha Rao** at D.No. 8-3-898/22, Road No. 3, Nagarjuna Nagar, Hyderabad-500 073. Ph: 23748672
Designed & Printed at: Nutan Art Printers, Lakdi-ka-pool, Hyderabad. **Editor** : V.Hanumantha Rao